

ముఖచిత్ర కారుడు

**మార్క్‌షాగాల్ (1887- 1985)**

మార్క్‌షాగాల్ 20వ శతాబ్ది ఐరోపా చిత్ర కారులలో కెల్ల అత్యంత ప్రతిభావంతుడు, ప్రాచుర్యం పొందిన వాడు. రష్యాలో ఒక యూదు కుటుంబంలో పుట్టాడు. సెయింట్ పీటర్స్‌బర్గు, ఆ తరవాత పారిస్‌లలో కళాన్వేషణలో విహరించాడు. దానితో అతనికి గ్రామీణ జీవితం నుంచి విముక్తి లభించింది. ఫ్రాన్స్ అతనికి రెండో గృహమైనా, అతని చిత్రాలలో రష్యన్ యూదు భావుకత అంతర్వాహినిగా ప్రవహించింది. తరచు అతని చిత్రాల్లో రైతు - గ్రామీణ జీవితమే ద్యోతకమైనా, అతని కాల్పనిక శక్తి దానిని స్వేచ్ఛా - ప్లవన స్వప్న ప్రతిమలుగా పరివర్తింప జేసింది. ఆప్రతిమలను ఒక దాని ప్రక్కన మరొక దానిని అమరించే తీరులో అతని మౌలిక సృజనాత్మకత కనిపిస్తుంది.

## ముఖచిత్రం గురించి

ఆనందాన్ని అభివ్యక్తం చేస్తున్న ఈ చిత్రంలోని రెండు ఆకృతులు షాగాల్ - అతని కాబోయే భార్య బెల్లావి. ఆమె అతని కోసం పూగుత్తులను తీసుకొచ్చింది. హాయి హాయి అయిన ప్రేమజంటలను చిత్రించడం అతనికి ఎక్కువ ఇష్టం. అయినా ఈ చిత్రంలో ప్రదర్శితమైన మహదానంద చిత్త వృత్తిని అతడు ఎప్పుడూ అధిగమించలేక పోయాడు. ఈ చిత్రంలో తన ప్రేయసిని ముద్దిడు కోవడానికి గాలిలో మెలికలు తిరిగిపోతూ సమ్మోహితుడైన తీరు కనిపిస్తుంది. ఇందులోని 'అసంబద్ధత' దానిని గురించి బెల్లా వివరించిన దానికి అనుగుణంగానే ఉంది: ''గవాక్షంలో నుంచి ఒక మేఘమూ, శ్యామాకాశమూ మమ్ములను పలకరించాయి. మెరిసే కుడ్యాలు మాచుట్టూ సుడులు తిరిగాయి. మేము పూదోటలపై, ఆవృతహర్మ్యాలపై, విమానాలపై, ప్రాంగణాలపై, దేవాలయాలపై విహరించాం.''

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 8 అక్టోబర్ 1996 సంచిక 9

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక

వరదతో మధురవాణి - పురాణం సుబ్రహ్మణ్య శర్మ

యుథినీజియ - డా. యమ్.సౌభాగ్యవల్లి, యమ్.డి., డి.జి.ఒ.

యంత్రాలు ఆలోచించగలవా? - కాకాని చక్రపాణి
- డా॥ డి. చంద్రశేఖర రెడ్డి

కవిత్వంలో భావచిత్రాలు - కొన్ని అభిప్రాయాలు - డా॥ తక్కోలు మాచిరెడ్డి

ఉత్కళ సాహిత్య నవయుగవైతాళికుడు ఫకీర్ మోహన సేనాపతి - కె.ఎమ్.వి.జి.కృష్ణమూర్తి

వివాహాల్లో గోత్రాలు - మేనరికాల ప్రాధాన్యం ఒక పరిశీలన - డా॥ తంగెడ కిషన్‌రావు

**ముఖచిత్రం : పుట్టిన రోజు** (1915 మ్యూజియమ్ ఆఫ్ మోడరన్ ఆర్ట్, న్యూయార్క్)

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

**Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# Watch out for who and whom

Continued from last month.

**- Willam Safire**

"Labour is talking the *ish*," said Benjamin Netanyahu in his campaign to become Prime Minister in Israel, "and we're talking the issues." That was a bilingual pun. *Ish* means "the man" in Hebrew; Netanyahu was saying that his opponents were turning away from the issues of the campaign in order to concentrate on his as an individual, as an *ish*.

A few years ago, after making a mistake that seemed to cast scorn on a former colleague, I admitted to a *Schadenfreuden* slip. That was a play on the German Schadenfrude, "guiltily taking pleasure in the suffering of friends, and *Freudian slip*, "a mistake revealing subconscious attitudes," based on teachings of Sigmund Freud, the one - man Prozac of his day.

With bilingualism on the rise, are bilingual puns increasing?

*The Economist* considered the impending issuance of a lengthy report by the Intergovernmental Panel on Climate Change and warmly welcomed it as "two thousand pages of *bumf*."

"Is *The Economist* playing a little joke?" asks a reader. "The pronunciation is very awkward."

My first, thought was that *bumf* was a recent derivation from *bom- fog*, an Americanism meaning "bombast, bloviation, empty talk," rooted in an acronym used by reporters covering Governor Nelson Rockefeller, who liked to use the expression "brotherhood of Man, fatherhood of God."

In an 1889 dictionary of slang by Barrere and Leland, however, the word is described as schoolboys' slang and defined as "paper...... A *bumf hunt* is a paper - chase.

TheOxford English Dictionary supplement provides an up-to-date definition and a grittier etymology. *Bumf*, also spelled *bumph*, is "toiletpaper" (which Americans have euphemised to *toilet tissue*, and further to *facial tissue*; down the toilet has gone *down the drain*).

In 1912, VirginiaWoolf wrote to Lytton Strachey: "Is this letter writen upon *Bumf*? It looks like it.

The etymolog y is *bum-fodder*, with bum meaning the buttocks, and *fodder*, originally "leaves and stalks," now "stuffing."

In current British usage, *bumf* is a contemptuous reference to a stack of documents, and is a useful contribution to the political lexicon.

***- New York Times Service***

# వరదతో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

కన్యాశుల్కం నాటక ప్రదర్శనకు 'నటాలి' మధురవాణి పాత్రకు ఇంటర్వ్యూ నిర్వహిస్తోంది.. చాలామంది నటీమణులు తమ అభినయాన్ని చూపించి వెళ్తున్నారు. నిజ మధురవాణి సైతం ఆ పోటీలో పాల్గొంటుంది చమత్కారంగా....

వరద : నిజ మధురవాణీ కంగ్రాట్సు. ఇది వరకు చార్లీచాప్లిన్‌కు కూడా ఇటువంటి మర్యాద జరిగింది. చార్లీచాప్లిన్ వేషం వేసి నాయనకు ఫస్టుప్రయిజూ, నిజంగా ఛాప్లిన్‌కు రెండవ ప్రయిజు వచ్చింది.

మధురవాణి : చౌకబారు రచయితలు మహాకవులు లాగా చెలామణీ అవుతుంటే మీలాటి వారు నిశ్శబ్దంగా సహించి వూరుకోవడం ఏమీ బాగాలేదు వరదా!

వరద : ఫామిలీ ప్లానింగ్ పెట్టినట్లే కవిత్వాలు ఎక్కువగా రాసే జబ్బు వున్నవాళ్ళకి దో యా తీన్ బస్ అనే రూలు పెట్టాలి.

మధరవాణి : (నవ్వి) మహాత్ముడిని మీరు చూశారా?

వరద : 1929లో మహాత్ముడు బెజవాడ వచ్చారు. తన ఖద్దరు నిధికి తోడ్పడమని అన్నారు. వేదిక దగ్గరకు వెళ్ళి నా ఉంగరాన్ని మహాత్మునికిచ్చాను. 'నా కివ్వమని నీకెవరు చెప్పారు' అని వారు ప్రశ్నించారు. 'నాకెవరూ చెప్పలేదు. నా అంతట నేనే ఇస్తున్నా నని అన్నాను. మహాత్ముడు నన్ను చేరదీసి 'పిల్లలు భగవత్స్వ రూపులు' అన్నారు. ఆ ఉదంతం అప్పటి ఆంధ్రపత్రికలో అచ్చయింది.

మధురవాణి : మీరు భగవంతుడ్ని ఎప్పుడు శంకించడం ప్రారంభించారు.

వరద : మా మేనత్త బియ్యం చెరుగుతున్నప్పుడు ఓ పద్యం అతి నాజూగ్గా చదవడం విన్నా. తరువాత మా అత్తయ్య చదిన పద్యం రాసిన ఆయన విశ్వనాథ వారని తెలుసుకున్నా.

మధురవాణి : చిత్రం చిత్రం మహాచిత్రం పరమ ఆస్తికులైన విశ్వనాథ వారి పద్యం భగవంతుని మీరు ఉన్నాడా లేడా అని శంకించేలా చేసిందా? ఏవిటి ఆ పద్యాలు?

వరద : **(ఆలపిస్తాడు) నా కనుల యెట్టయెదుట నా జనకుని**
**నా జనని కుత్తుకల గోసి నన్నడిగె**
**నతండు 'నే దయాంబుధినికాదా' యటంచు**
**ఓ ప్రభూ! అగునంటి నే నొదిగియుండి.**

**నాకనుల యెట్ట యెదుట నా లతాంగి**
**ప్రాణములు నిల్వునందీసి యడిగె నను న**
**తండు 'నేదయాంబుధిని కాదా' యటంచు**
**ఓ ప్రభూ! యగునంటి నే యొదిగి యొదిగి**

నా కనుల యెట్టయెదుట నా యనుంగు
తనుజు కుత్తు క నులిమి తా నడిగె న
తండు 'నేదయాంబుధిని కాదా' యటంచు,
ఓ ప్రభూ! నీవయంటి నే నొదిగి పోయి.

మధురవాణి : వచన పద్యం మీకు నచ్చుతుందా?

వరద : వచన పద్యమేమిటి మిల్లు ఖద్దరులాగ.

మధురవాణి : మీ నాన్న గారి మంగళసూత్రం కథలో ఇతర వ్యాసాలలో అంతర్వాహినిగా ఒకచిన్న విషాదపుజీర ప్రవహించేది. అది ఏమిటి?

వరద : మా చిట్టి చెల్లెలు సుజాత వ్యాధిపీడితురాలయి పోయింది. ఆ విషాదం నుంచి వెంటనే మేమెవ్వరం కోలుకోలేదు. నేను పద్యాలు కూడా రాశా!

నాన్నగారి వేదాంతము నెన్నిసార్లు
వినుచు నోపికపట్టగలవని తలచి
స్వామి గుడి వాకిలిం జేరి ప్రార్థనమ్ము
చేసినా నొకమారు నాచెల్లి కొరకు

ఈ పద్యాన్ని సత్యనారాయణ గారు మెచ్చుకున్నారు

మధురవాణి : కవి కుమారుడు కవి కుమారుడే అవుతాడు. మీరు పండిత పుత్రులు కాలేదు.

వరద : నీవు విసరిన పూలమాలిక దైవ సన్నిధి చేరలేక
అపుమాపుము ఆర్తనాదము, ఆలయమునకే పోదము అని
నేను స్కూల్లో చేరక ముందు రాస్తే పురిపండా, శ్రీశ్రీ అంతా
దంగైపోయారు నాధాటికి. మొదట నన్ను అడ్మైర్ చేసి
నన్ను చివరి దాకా ఫాలో అయినది మిసెస్ ఏవిఎన్. కళాశాలకు
అనుబంధంగా వుండే స్కూల్లో సహ విద్యార్థి రాచకొండ విశ్వనాధశాస్త్రి.

మధురవాణి : మీ నాన్నగారి వల్ల మీ యిల్లు ఒక కవుల ట్రాఫిక్ ఐలండులా వుండేదనుకుంటా!

వరద : పురిపండాగారి ఖాదీ భాండార్ ఒక ట్రాఫిక్ సాహిత్య జంక్షన్ అయితే మాయిల్లు ఆధునిక కవులకి ఒక కూడలి. యూనివర్సిటీ సంగతి సరేసరి. మూడవ పీఠం, బిరుదు పిండప్రదాత బుర్రాశేషగిరి రావు గారిది ఆంధ్ర భారతీతీర్థం. ఆసంస్థస్నాతకోత్సవం విశాఖపట్నంలో జరిగింది. అక్కడికి పురిపండా, శ్రీశ్రీ తురగా వెంకట్రామయ్య వగైరా నన్ను తీసుకెళ్ళి నాచేత నా అముద్రిత నాటకం తపోభంగం చదివించారు. రతీమన్మథుల కథ అది. అంతా శిష్టవ్యవహారికం. నాముందు కూర్చున్న తెలుగు మాస్టారు గిడుగురామమూర్తి పంతులుగారు. నా నాటకం వ్రాతప్రతిని పంతులు గారు చూసి అక్కడక్కడ

సరిచేశారు. ఆయన పరిచయ ప్రభావం వల్ల నేను పరీక్షల్లో వ్యాకరణం ప్రశ్నలు ముట్టుకునే వాడ్ని కాదు.

మధురవాణి మీ మొదటి కథ ఎప్పుడు అచ్చయింది?

వరద జ్వాల 1934 నవంబరు సంచికలో. ప్రథమ యుద్ధం కథపేరు.

మధురవాణి మీ రెవ్వరికీ సాధారణంగా నమస్కారం చెయ్యరని విన్నా.

వరద దువ్వూరి రామిరెడ్డి గారికి చేశా, ఆయన పద్యాలంటే ప్రాణం.

మధురవాణి ఇంతకీ మీది ఏ పార్టీ.

వరద 1940 జూన్‌లో రాడికల్ డెమాక్రాటిక్ పార్టీని ప్రారంభించాం. మా పార్టీలో మిసిమి ఆలపాటి రవీంద్రనాథ్ గారు కూడా వుండేవారు.

మధురవాణి : అన్నట్లు సంపంగితోట ఎవ్రరాశారు? తరువాత చాలా మంది వాటాకు తయారయారు, అందుకు?

వరద : నేను, శ్రీ శ్రీ. మాతోబాటు శ్రీరంగం నారాయణ బాబూ పనిచేశాడు. శ్రీరంగం నారాయణ బాబుకి సంపెంగ తోట కర్తృత్వంతో ఏమీ సంబంధం లేదు. దానికి మ్యూజిక్ బాలాంత్రపు రజనీకాంతరావు చేశాడు.

మధురవాణి : మీకు సూతాశ్రమం తెలీకుండా వుండదు.

వరద : నటాలిని చీరాలనుంచి తెనాలికి మార్చాం, సూతి శ్రమంలో గోపీచందూ ఆయన తమ్ముడు గోకుల్‌చందూ వుండేవారు. పి.వి.సుబ్బారావూ, మద్దిపట్ల సూరీ, బైరాగీ నేనూ కలిసేవాళ్ళం. గాంధీ చౌకుదగ్గర గుడ్‌విల్ అండ్ కో అనివుండేది. ఆదుకాణంలోకి సాయంత్రం నాలుగవగానే మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి వచ్చేవారు. గాంధీ చౌకులో మరో దుకాణానికి చక్రపాణి వస్తూవుండేవాడు. అక్కడికే ధనికొండ హనుమంతరావు కూడా వచ్చేవాడు.

మధురవాణి : మాయసుందరి గోడవేవిటి? అన్నట్లు మీకెవరో చిన్నపుడే సాష్టాంగపడ్డాడట ఆ విశేషం?

వరద : వాడా శిష్టా ఉమామహేశ్వరరావు నన్ను చూసి నేలమీద పడ్డాడు - నవమి చిలుక అదీరాశాడు. ఎక్సెంట్రిక్ ఫెలో - హెరాల్డు బ్రిగ్‌హవుస్ ఇంగ్లీషులో రాసిన 'ది' ప్రిన్స్‌హువజ్ ఎపైపర్' అనే నాటకాన్ని 'ప్రతిమా సుందరి'గా అనువాదం చేశా. ఇదంతా గుంటూరులో. కూర్మా వేణుగోపాల స్వామి నాయుడుగార్ని రిహార్సల్సుకి తీసుకొచ్చానేనే. చీటికీ మాటికీస్టేజివెనకాలకి వచ్చి ఎవరికీ సంబంధించని సూచనలు యిచ్చేవారు. నేను ఆక్షేపణ చెప్పా. మా యాసుందరి అని పేరు మార్చి అదే నాటకాన్ని నాట్య సమితి చేత వేయించడం ప్రారంభించారు, నా పేరు లేదు.

మధురవాణి : ఇదేమి చాంచల్యం?

అప్పుడు బెజవాడలో మల్లాది వారి అధ్వర్యంలో ప్రతిమాసుందరి అచ్చయి రిలీజయింది. నటాలి అధ్వర్యంలో మానాన్నగారి పర్యవేక్షణలో రెండు వందల నలభై సార్లు తెలుగు దేశం అంతటా ప్రదర్శించారు.

మధురవాణి : వర విక్రయంలో సింగరాజు లింగరాజు వేసిన బలిజేపల్లి లక్ష్మీకాంతం గారు మీకు తెలుసా?

వరద మానాన్నగారంటే ప్రాణం, మదరాసులో కన్యాశుల్కం వేసినప్పుడు అగ్నిహోత్రావధాన్లు వేసి అమోఘంగా నటించారు. నేనూ, లక్ష్మీకాంతంగారూ, శ్రీశ్రీ, నళినీ కుమార్ (పూర్వం ఉండవల్లి సూర్యనారాయణ ఆఫ్ విజయనగరం ఫేమ్ లక్ష్మీ కాంతంగారి మన కోడలు డాక్టర్ వరం తరచు కలిసి తిరిగేవాళ్ళం మాంబళం వీధుల్లో.

మధురవాణి ఈ రోడ్ల మీద తిరగటమే నాయింకేమైనా చేశారా?

వరద మొదట ఆంధ్ర ప్రభలోనూ తర్వాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లోనూ సబ్బింగ్ చేశా మదరాస్ వార్‌రెవ్యూ అసిస్టెంటు ఎడిటర్‌గా వెలగబెట్టా. శ్రీశ్రీ నేనూ వారం వారం కలిసేవాళ్ళం. శిష్టా, జరుక్ శాస్త్రి వస్తూండేవారు. నేనప్పుడే రుక్కుటేశ్వర శతకం అని ముప్పయ్ పద్యాలు రాసి శ్రీశ్రీ కిచ్చా. వాడెక్కడో పారేశాడు.

మధురవాణి శ్రీశ్రీ కవిత్వానికి ఒక పత్రిక పెడతానన్నార్ట?

వరద పత్రిక ముఖ పత్రం మీద చెళ్ళ పిళ్ళ వేంకటశాస్త్రి గారి అరచేతుల్ని ముద్రిస్తాననేవాడు. ఆయన వేళ్ళు బాగా కనపడాలన్నాడు. ఇద్దరం కడియం వెళ్దామనుకున్నాం. ఇద్దరిదగ్గరా డబ్బుల్లేవు, ధ్వని దాని పేరు.

మధురవాణి (నవ్వి) తరువాత 'కవిత' పెట్టింది మీరేగా?

వరద నేను, రాయ ప్రోలు రాజశేఖరు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, అజంతా మాతోపాటు శ్రీశ్రీ ఒకకొత్త మలుపు తేవాలని ఉబలాటపడ్డాం. మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు చాలా సంతోషించారు. విశ్వనాథ వారు కవితకు తప్పకుండా రాస్తామన్నారు. సంవత్సరానికి మూడుసార్లు విడుదల చెయ్యాలని.

మధురవాణి కవితకు సంపాదకీయం మీరురాశారా, నాన్నగారా?

వరద స్వవిషయ సూచిక అని ఆస్కార్ వైల్డ్ పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రేకు రాసినవి అనువాదం చేసి తొలిపుటలో వేశాం. రామణీయకాన్ని సృష్టిస్తాడు కళాస్రష్ట, నీతికరం, అవినీతికరం అంటూ గ్రంథాలు లేవు; బాగా వ్రాసిన పుస్తకాలూ, బాగా వ్రాయని పుస్తకాలూ, అంతే -

మధురవాణి : కవులకొట్టేపేస్లు పట్టు కుంటే కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదినట్లు వుంటుంది. అతనేగదా యాపత్కాళా నిష్ప్రయోజనకరం అంది. కళవిలువను నిర్ణయించాల్సింది దాని రామణీయకతను బట్టికాదు, ఋజుమార్గ ప్రవర్తనను బట్టి అని అతనేగా అన్నాడు?

వరద : టి.యస్. ఇలియట్‌వాక్యాలు కూడా కొన్నివేశాం. సరిహద్దులను కరిగించడమే కవిత్వం మాహాత్మ్యం. శ్రీశ్రీ 'నగరంలో వృషభం' తొలిప్రచురణ కవితలోనే. ఆరుద్రగుమాస్తా ప్రేమగీతం, అజంతా ప్రసిద్ధమైనచెట్లు కూలుతున్న దృశ్యం, తిలక్‌గొంగళిపురుగు, పఠాభి యాతా ఛందస్సులు అచ్చయింది అందులోనే.

మధురవాణి : మీరు నిజంగా పెద్ద సారువారు. మీరుజైల్లో వున్నారట - గిరీశం గారిలా గొడవల్లో పడి నలిగిపోలేదు కద!

వరద : రాజకీయఖైదీగా జులై1948లో రాజమండ్రి సెంట్రల్‌జైల్లో నిర్బంధంలోవున్నా. నాపూర్వజీవితాన్ని హైదరాబాద్ అనుబంధాల్నీ శంకించి నన్ను నిర్బంధంలో వుంచి నాచేత ఆధునిక ప్రారంభ కావ్యం 'చిరకాలం' రాయించారు.

మధురవాణి : ఏమిటి కథ?

వరద : జైల్లో ఉరికోసం నిరీక్షిస్తూన్న ఒక ఖైదీ వుంటాడు. అతను కట కటాల మధ్యవున్నా నిరంతరం మృత్యుసన్నిధిలో వుండేవాడు. అతను నిరపరాధి నని చెప్పుకుంటూ తనపై అధికారులు మోపిన నేరం గురించి చెప్పేవాడు. తనకెలాగూ చచ్చిపోవాలనివుంది. తనపై ఆరోపించిన నేరం గురించి బాధ పడేవాడు. అప్పటి రాజకీయ పక్షాలన్నిటిలో పనిచేశాడు. ఎవరూ తనక్కావలసిన సహాయం చెయ్యలేక పోయారు. నిరుద్యోగంలో, కఠిన దారిద్ర్యంలో - కుటుంబం భార్యాపిల్లలూ ఆకలికి తట్టుకోలేక పోయారు. అందరూ కలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్నాం కత్తితో పొడుచు గున్నప్పుడు పోలీసులు వచ్చి పట్టుగున్నారు. అదీ అతని కథ. ఈ ప్రపంచంలో తనకు ఆధారం లేనపుడు ప్రపంచాన్ని వదిలేసి పోవటానికి తనకు హక్కులేదా అని అతని వాదన! ఇక్కడే బాగుంది, బయట బాధే బాబూ, మాలాటి వాళ్ళ కనేవాడు.

మధురవాణి : చిన్న ఆశాకిరణం కూడా లేని జీవితాన్ని కవులు చిత్రించడం న్యాయమా? నిరాశామయ లోకంలో కదన శంఖం పూరిస్తున్నా నన్నాడు మీపేదలకని.

వరద : కలకాలం చెరకాలం

సిలువై తుది కావ్యమై స్పృశించెను వరదా! అన్నాడు శ్రీశ్రీ. తన తోపాటు తీసుకెళ్ళి నావ్రాతప్రతిని ఎక్కడో పారేశాడు మావాడు.

ఒకసారి అందులో కొన్ని ఖండికలు తెలుగు స్వతంత్రలో గోరా శాస్త్రి

ప్రకటించాడం. ఏవో పోగుచేసి 'అందాక' అని అచ్చువేశా.

మధురవాణి : తిరిగి మళ్ళీ రాయమని ఎవరూ బలవంతపెట్ట లేదా?

వరద : అందులో చాలా వరకు సంప్రదాయ ఛందస్సు వాడా. నాకే అంతా అడిగినా మనస్కరించక రాయలేదు. అది రాసినపుడున్న దృష్టి వేరు. చాలా వరకు రాసింది వ్యవహారిక భాష. మాత్రాఛందస్సులు ముత్యాల సరాలు కూడా వున్నాయి.

మధురవాణి : మరి మీస్నేహితులంతా ఛందస్సుల మీద విరుచుకు పడతారేం?

వరద : రాయటం రాక. తెలుగువాడి ఆస్తి తెలుగు పద్యమే గదా!
కృష్ణశాస్త్రిగారు కూడా అభినందించారు. ఒకటి గుర్తు.

**కారుమబ్బు వానకారు, వాగులుపొంగు**
**నిండి నదులు, వరద నింగి కెగసి**
**వాన లోన నీవు వాన కావల నేను!**
**అంతె బతుకు, చివరికంతె అంతె**

మధురవాణి : వానలోన నేను, వాన కావల మీరు చాలా గొప్పగా అన్నారు. మీరు పండిత నెహ్రూని ప్రెస్‌మీట్‌లో కంగు తినిపించారట.

వరద : నెహ్రూగారు ప్రజాస్వామ్య పాదుషా. స్వాతంత్ర్యం కోసం పోరాడిన నెహ్రూవేరు, ప్రధాని నెహ్రూవేరు. అడిగా, దేశమంతటా పర్యటిస్తున్నారు గదా కాంగ్రెస్‌విజయావకాశాల గురించిమీ అంచనా ఏమిటి? అని. ఏవో ఒకటి రెండు చోట్ల తప్ప మొత్తం మీద కాంగ్రెసు విజయదుందుభి మ్రోగిస్తుంది, అన్నారు. ఒకటి రెండు చోట్ల మాత్రం కాంగ్రెసు ఎందుకు ఓడిపోవాలి అని అడిగా. దీనికి తికమకపడి జేబులోంచి సిగరెట్‌తీసి ఒకటి ముట్టించారు. గాంధీ టోపీ తీసి తలతడుముకున్నారు. కాంగ్రెసు ఎందుకు ఓడిపోతుందంటే ప్రజలు తెలివైనవారు కాబట్టి అన్నారు. అంటూ ఆయననవ్వేశారు. రెండో ప్రశ్న. కాంగ్రెసులో అవినీతి పెరిగిపోయిందని వినవస్తున్నది. దీనికి మీరేమంటారు అన్నా. నెహ్రు జవాబు ఈకూత కూసింది ఎవరు? కాంగ్రెసులో అని నీతి ఉందనడంఅసంబద్ధ ప్రేలాపన. నిజానికి అవినీతి విషయంలో ప్రతిపక్షాలు పరమ అధ్వాన్నం. అని ఆయన కోప్పడ్డారు విరుచుకుపడి. నాకేసితిరిగి మిస్టర్ నీ ప్రశ్న నాకు కోపం తెప్పించింది. నాకోపం నీ మీద కాదు అన్నారు.

మధురవాణి : నెహ్రుగారు హైదరాబాద్ ది మిశ్రమ సంస్కృతి అనీ భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా దాన్ని విడదీయడం తగదనీ గొడవ పడ్డారట ప్రెస్‌మీట్‌లో - ఏమాకథ?

వరద : నీవుచెప్పినట్లే సమ్మిశ్రిత సంస్కృతీ కేంద్రం అది అలాగే వుండాలన్నారు. మరి ప్రజలు భాషా ప్రయుక్త రాష్ట్రాలు కోరుతున్నారు కదా అని ఒకరన్నారు.

'ప్రజలు పారబడితే దిద్దే బాధ్యత మనది' అన్నారు నెహ్రూ. ప్రజలంతా అలా కోరితే మీరు అనుమతించక తప్పదు కదా అని నేనన్నాను. అలాకుదరదు. ప్రతి తలుపూ తట్టి మీరు చేసేది మంచి పని కాదు అని నేను చెబుతా. హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా వుంచేట్టు ప్రయత్నిస్తాను అన్నారు నెహ్రూ. అప్పుడు నేను కొంచెం ధైర్యం చేసి 'అలా మీరుచేస్తే భారత ప్రధానికి, వెనకటి నిజాంకు ఏమిటి భేదం' అన్నా. నెహ్రూ మొగం ఎర్రగామారింది, బల్ల మీది సిగరెట్టు డబ్బా నేలకేసి కొట్టారు. నేనులేచి ఆడబ్బా తీసి ఆయన బల్ల మీద పెట్టా, నావంకచూసి గట్టిగా నవ్వుతూ నేను చెప్పింది జాగర్తగా ఆలోచించండి అంటు లేచారు. నేను పక్కన చేరి అన్నా! సమ్మిశ్ర సంస్కృతి ఏమైనా ధర్మబద్ధమా? అని. యింకా విపులంగా వివరించా నిజాం చేసినవి. తన ఉద్దేశం అది కాదనీ ఉన్న పరిస్థితి గురించి మాట్లాడుతున్నాననీ పండిట్‌జీ అన్నారు.

మధురవాణి : అయితే హైదనాబాద్ నగర చతుశ్శతాబ్ది ఉత్సవాన్ని జరపాలంటారా? వద్దా?

వరద : ఈ నగరం వయస్సు నాలుగు వందలయితే అందులో రెండు వందల ఏళ్ళకు పైన అసఫ్‌జాహీ వంశస్థుల పాలనలో గదా యీ నగరంవుంది! ఏనుగుల వీరాస్వామి గారి 'కాశీయాత్ర కూడా అప్పుడు జరిగింది. ఆయన ఆనాటి రాజకీయ పరిస్థితి కళ్ళకు కట్టేట్టు రాసి చక్కాపోయాడు. మతసామరస్యం అనేది దేవుడెరుగును. శాంతి భద్రత శూన్యం. ప్రజల దోపిడీ ప్రధానం. వారు తెలుగు భాషని ఆదరించారని డబ్బాకొట్టు కోవడం కంటితుడుపే. తెలుగు భాషకి సంస్కృతికీ ఏమీ ఉపకారం జరగలేదు. అసఫ్‌జాహీ వంశస్థులు అధికారంలోకి వచ్చినప్పటి నుంచీ జరిగింది తెలుగుకి అపకారమే. నగరంలో మరీనూ. కమ్యూనిస్టులూ, కాంగ్రెసువాదులూ, యితర దేశ భక్తులూ అసఫ్‌జాహీ దుష్టపరిపాలనకు స్వస్తపలికించేందుకు మహత్తరమయిన త్యాగాలు చెయ్యవలసి వచ్చింది. ఈ నగరానికి చతుశ్శతాబ్ది ఉత్సవం ఎలా చేస్తారో ఎదురుచూస్తున్నాం.

మధురవాణి : కుహనాలౌకిక వాదులు వారి దురవగాహన వల్ల యిలాటి దిక్కుమాలిన పరిస్థితులు వస్తాయి. ఈ ఊరు కంపునీ దారుల్నీ బాగుచేసి, ట్రాఫిక్‌ను క్రమబద్ధం చేయక దిక్కుమాలిన ఉత్సవాలు ఎందుకు? ఇంతకీ భాగ్మతి అనే ఆవిడ వున్నట్టా లేనట్లా?

వరద : భాగ్మతిగా ఆవిడ్ని ప్రేమిస్తే ఆవిడ సంస్కారాన్ని గౌరవించక పాదుషా యీ వూరిని హైదరాబాదు అనడం ఏంకర్మ? చారిత్రకంగా యీ కథకు దాఖలా ల్లేవంటారు విజ్ఞులు.

మధురవాణి : శుభ్రంగా విజయువాడ, గుంటూరుల మధ్య వాంఛహ చెప్పినట్లు

ఆంధ్రరాజధానిని కట్టుకుని వుంటే బాగుండేది? ఈ నిజాం బిల్డింగులు వగైరా విసర్జించిన దానికి ఎగబడి తెలుగు వినబడే చోట్ల కట్టుకోకుండా దిగబడ్డారు తెలుగువారు, దీన్ని రాజధాని అంటూ....

వరద : ఇక హైదరాబాధ వదిలేయ్.

మధురవాణి : అకాడమీలు స్థాపించాలని మీ నాన్నగార్ని అంకురార్పణ పనులు చేసిపెట్టమన్నార్ట పట్టాభి రామారావు గారు.

వరద : చదలవాడ పిచ్చయ్య ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ప్రచార కార్యదర్శి, నార్లగారికీ మా నాన్న గారికీ హైదరాబాద్‌లో వున్న సాహిత్య వాతావరణం గురించి తెలీదు. అందుకని నన్ను సంప్రదించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక ప్రకాశం గారిని దింపి నీలం సంజీవరెడ్డి గారు ముఖ్యమంత్రయ్యారు. ఆ తతంగంలో నాదీ వుంది కీలకపాత్ర.

మధురవాణి : మీరు రామప్పంతుల్లా వ్యవహారాల్తో యమ బిజీగా ఉండే వార్నన్న మాట.

వరద : పబ్లిక్ రిలేషన్స్ మీద ఓ పుస్తకం రాశా. నేను బి.ఏ. ఆనర్సు తరువాత ఎం.ఏ. చేశా. ఆరుద్ర లాగ యఫ్.ఏ. కవినిగాను. దలైలామా తప్పించుకుని ఇండియా వచ్చినపుడు దలైలామా అండ్ ఇండియా, ఇండియన్ పబ్లిక్ అండ్ ప్రైమ్ మినిష్టర్ ఆన్ టిబెటన్ క్రయిసిస్ అనే గ్రంథాన్ని సంకలనం చేసి ప్రచురించా.1958 నెహ్రూ గారి జన్మదిన సందర్భంగా 'మోడ్రన్ ఇండియన్ పొయిట్రీ - ఏన్ ఎంథాలజీ' అనే గ్రంథాన్ని సంకలితం చేసి నెహ్రూకి బహూకరించా. 'ఇండో ఆంగ్లియన్ పొయిట్రీ' కవిత క్రింద ప్రచురించా. అస్సామీస్ కవితా సంకలనం, షష్టిబ్రతా అనే బెంగాలీ కుర్రాడి పొయిట్రీ వేశాం.

మధురవాణి : జాగ్రత్తగా ఉంటే గిరీశం గారు కూడా మీ అంత ప్రజ్ఞ ప్రతిభ కలవారు అయ్యేవారనుకుంటా. పూటకూళ్ళమ్మ దగ్గర చేరడం వల్ల అలా అయాడు కాని. ప్చ్!

వరద : నే నెక్కడ వాడెక్కడ. నీకతని మీద వున్న గురికి థాంక్స్!

మధురవాణి : మీరు విస్కాన్సిన్‌లో తెలుగు విజిటింగ్ ప్రొఫెసర్గా వున్నారట. అలాటి ఉద్యోగం మా గిరీశం గారికి వస్తే జమాయించేవాడు.

వరద : అప్పుడు తిరుపతి జి.యస్. రెడ్డి గారు, చేరాగారు అక్కడ ఉండేవారు. న్యూయార్క్‌లో మన మందుమిత్రుడు ఎ.ఆర్. కృష్ణ కేరాఫ్‌లో మన మకాం.

మధురవాణి : సాహిత్యంతోనూ సాహిత్యేతర విషయాలతోను రాజకీయాలతోనూ

రాజకీయేతరవిషయాలతోనూ విద్యారంగంతోనూ మీకు సత్సంబంధాలు -న్నాయి. మీరు క్రికెట్‌లో ఆల్‌రవుండర్ లాటి వారు.

వరద నేనేం కపిల్‌దేవ్‌నీ, సునీల్‌గవాస్కరునీ కాను. నీ గిరీశాన్ని అంతకంటే కాను, నాకు బిరుదులక్కర్లేదు. సన్మానాలు అంతకంటే అక్కర్లేదు.

వరద చాలాకాలం పి.వి. గార్కి, రాజీవ్‌గారి కాలంలో, మీరు పి.ఏ. గా వుండేవారట.

వరద ఒకప్పుడు, ఇప్పుడు మా ఆవిడకు పి.ఏ.గా ఉంటున్నా.

మధురవాణి మీరు మల్లాది వారితో 'వరద రాజేశ్వరరావు అంత్యక్రియలు' రాస్తున్నానని చమత్కరించారట!

వరద ప్రతిపాదాంతంలోనూ క్రియ వచ్చేట్లు చేశా, ఆరుద్ర కూడా చేశాడీపని. ఢిల్లీలో మా నాన్నగారి దర్శకత్వంలో 'కన్యాశుల్కం', 'మృచ్ఛకటికం' చేశాం. అప్పుడు నువ్వొస్తే బాగుండేది కదా!

మధురవాణి మీ నాటకంలో మధురవాణిగా నేను పనికొస్తానా?

వరద అయిదు రోజుల పెళ్ళిలా జరిగిందా కార్యక్రమం ఢిల్లీలో.

మధురవాణి మీరు విశాఖలో సెటిలవక హైదరాబాద్ చేరారేం? కాల్పనిక సాహిత్యానికి పెద్ద భవిష్యత్తు లేదన్నార్ట మీరు?

వరద లేదు, రాసేవాళ్ళు మానేశారు. రాయగూడని వాళ్ళు విజృంభించిపోతున్నారు. ఆవిష్కర్మలు అంకితాలు, సన్మానాల జోరు ఎక్కువైపోతోంది.

మధురవాణి మీ నాన్న గారి పద్యాలు పురాణం పట్టుకపోయి వేశాట్ట ఆంధ్రజ్యోతిలో.

వరద ఒకటి గ్యాపకం.

చచ్చిపోయి జీవి యెచ్చట కేగునో
ఏమి యగునో యెవరి కెరుగ రాదు
ఎరుకలేని వారలే మేము చెప్పగా
విని తపించు వారు వేన వేలు.

మధురవాణి తెలుగువాడి గురించి మీ వ్యాఖ్య వినాల నుంది

వరద తెలుగువాడు దుర్యోధనుడిలాంటివాడు. దుర్యోధనుడు తనకేమీ కావా లనడు. ధర్మరాజుకి మాత్రం ఏమీ ఉండకూడ దంటాడు. తెలుగువాడూ అంతే.
I had a loving quarrel with the world.

మధురవాణి మీతో గప్పాలు కొడుతున్నానని గిరీశంగారు కోపం చేస్తున్నారు వరదా! ఛీరియో

(వరద అంటే అబ్బూరి వరద రాజేశ్వర రావు)

* * *

# యుథినీజియ

– డా.యమ్.సౌభాగ్యవల్లి, యమ్,డి., డి.జి.ఒ.

'జాతస్య మరణం ధృవం', పుట్టిన వాడు గిట్టక తప్పదు. మృత్యువును జయించిన వారు లేరు. అసలు దాని రహస్యాన్ని ఛేదించిన వారూ అంతకంటె లేరు. అది ఎప్పుడు వస్తుందో గూడ ఎవరూ చెప్పలేరు. అయితే అది ఎప్పుడు వచ్చినా మనిషి తీసుకోకుండా, మంచం పట్టకుండా, ఇతరుల తోటి చేయించుకోకురడా, బాధలు అనుభవించకుండా పోవాలనే కోరుకుంటాడు. మరణం సుఖంగా ఉండాలనుకొంటాడు.

ఒకామె, వేకువ జామునే లేచి, కాలకృత్యాలు ముగించుకొని, స్నానం చేసి, మడిచీర ధరించి, జుట్టుజారుముడి వేసుకొని, పూజగదిలోకి ప్రవేశించి పూజప్రారంభిఛచింది. ఆ తరవాత నైవేద్యం పెట్టి, పాలగ్లాసు చేతిలో పట్టుకొని క్రిందికి ఒరిగింది. ఒరిగిన క్షణంలోనే ప్రాణం పోయింది. మిగతా వారంతా ఆమె మోకరిల్లి ధ్యానం చేస్తుందనుకొన్నారు. ఆ తరవాతగాని అసలు సంగతి-తెలియలేదు. ఎంత సునాయాస మరణం. అది చాలా అదృష్టం అనుకొన్నారు.

ఒకసారి మా దూరపు ఒంధువు ఒకామె మా యింటికి వచ్చి, ''మీరు ఒకమాటు మాయింటికి వచ్చి మా అమ్మను చూడాలి,'' అని అర్థించింది. వారి ఇంటికి వెళ్ళి చూద్దును గదా, ఆమె అమ్మను ఔట్‌హౌస్ లాంటి రేకుల షెడ్‌లో ఉంచారు. అక్కడ నులకమంచం మీద క్షణాలు లెక్కపెడుతూ ఉంది. ఆమెకు బిడ్డసంచి ముఖద్వారం వద్ద పుట్టకురుపు లేచింది. వ్యాధి ముదిరిపోయింది. ఎవరు చేయగలిగింది ఏమీలేదు. ఒళ్ళంతా పుండ్లు పడిపోయింది. దుర్గంధంతో ముక్కు పుటాలు పగిలిపోతున్నాయి. అక్కడికీ వాళ్ళు చేయగలిగిన దంతా చేస్తున్నారు. ''ఈ నరకం నుంచి నన్ను విముక్తురాలిని చేయండి. ఏదైనా మందు ఇచ్చి త్వరగా చనిపోవడానికి దోహదం చేయండి, డ్కాక్టరు గారూ! ఈ రహస్యం ఎవరికీ తెలియనివ్వను,'' అని ఆ రోగి వేడుకొంది. నేను ఏమి చెయ్యాలి? నా కర్తవ్యం ఏమిటి? రోగం తగ్గదని తెలుసు ఆమెకు మృత్యువు తప్ప గత్యంతరం లేదని తెలుసు. నేను అలా నిమిత్తమాత్రురాలుగా చూస్తూ ఉండవలసిందేనా?

వయస్సు మీదపడిన కొద్దీ శరీరంలోని జీవాణువుల ఉత్పత్తి తగ్గిపోతుంది. రక్త ప్రసరణం తగ్గి అవయవాల పనితీరు మారుతుంది. శరీరం, సహాయనిరాకరణం చేస్తుంది. మస్తిష్కంలో కణాలు దెబ్బతిన్నప్పుడు, మతిమరుపు తీవ్రమై, పరిసరాల జ్ఞానం నశిస్తుంది. ఎక్కడెక్కడో తిరుగుతారు. ఏమేమో చేస్తారు. ఈ రకం మనుషులు కొందరు వీరిని ఏం చెయ్యాలి?

కొంతమంది పిల్లలు, పుట్టిన తరవాత, ఆరునెలలు నిండినా, మెడ నిలపలేరు. ఆ తరవాత కాలం గడిచినా ఆ పిల్లలు పరిసరాలకు ప్రతిస్పందించలేరు. నాలుక బయటకు పెట్టి వెర్రి నవ్వు నవ్వుతారు. ఇటువంటి వారిని ''పుట్టు మూర్ఖులు'' (Congenital idiots) అని తేల్చారు డ్కాక్టర్లు. ఈ పిల్లల్ని ఏం చేయాలి? ఎంతకాలమైనా అలా పెంచవలసిందేనా?

సమాజానికి ఏ రకంగాను పనికిరాని, కుదర్చడానికి వీలు లేని లోపాలతో, రోగాలతో బాధితులయ్యే మనుష్యులను ఏంచెయ్యాలి? నాజీలు ఒకప్పుడు దయాహీనంగా ఇటువంటి వారిని ఈలోకం నుంచి తొలగించేవారు. మరి జంతువుల విషయంలో అయితే పెద్దగా ఆలోచించడం లేదు. మా పెంపుడు కుక్క మానం చుట్టూ వ్రణమై రక్తం చుక్కలు చుక్కలుగా పడుతూ ఉంటే పశువుల డ్కాక్టరు Mag sulf injection ఇచ్చి దాని కథ ముగించాడు. మనుషుల విషయంలో ఇంత తేలికగా నిర్ణయం తీసుకోగలమా?

అలా తేలికగా మందిచ్చి రోగి కథముగిస్తే అది హత్య క్రిందకు వస్తుంది. అదే రోగి స్వయంగా మందుతీసుకొని, తన కథకు భరతవాక్యం పలికితే అది ఆత్మహత్య అవుతుంది.

అసలు సునాయాస మరణానికి ఏ డాక్టరునైన అర్థిస్తే, ముందు అతనికి నైతిక సూత్రాలు, విలువలు, మానవతా ప్రతిస్పందనలైన కరుణ, జాలి అడ్డం వస్తాయి. అంతేకాదు, అతడు ఆ పనికి పూనుకొంటే హంతకుడవుతాడు. ఇవన్నీ అడ్డాలే, ఇవన్నీ ఆటంకాలే కనుక, మరి కుదరని రోగంతో బాధపడేరోగిని, తన జీవితాన్ని నూటికి నూరుపాళ్ళు ఇతరులపై ఆధారపడి బహుబాధాకరంగా గడిపే వ్యక్తిని వారి వారి మానాలకు వారిని వదిలి వేయవలసిందేనా?

దయామయులైన కొందరు ఈ ప్రశ్నను సానుభూతితో పరిశీలిస్తున్నారు.

క్యాన్సర్ లాంటి నయంకాని దీర్ఘ వ్యాధులతో అనుక్షణం మృత్యువు అంచుల మీద నిలిచిన వారిని, సంవత్సరాలకు సంవత్సరాలు స్పృహకోల్పోయి, మళ్ళీ ఎప్పటికీ చైతన్యవంతులు కారని గట్టిగా చెప్పగలిగిన సందర్భాలలోను, వారికి ఏదైనా మందు ఇచ్చి, మరణం కోసం ఎదురుచూసే పనినుంచి తప్పించడం మంచిది అంటారు 91 సంవత్సరాలున్న అమెరికన్ వైద్యుడు డాక్టరు బెంజమిన్. తాను గత 25సంవత్సరాలుగా అటువంటి రోగులకు సునాయాసమరణానికి

పూర్తిగా ఆశలు వదులుకొన్న రోగుల విషయంలో బ్రిటన్‌లోని చాలామంది డా
కృత్రిమ ప్రాణవాయువు, ఆహారం, రక్తం సరఫరాలను ఆపివేయడం మంచిదనే నిర్ణయానికి వచ్చారు. ఇదివైద్యవృత్తి నీతికి హిపోక్రటీజ్ ప్రవచించిన నీతికి విఘాతం కాదా అనే మీమాంసను వారు ఎదుర్కొంటున్నారు. ఈ సమస్య మీద వేయిమంది న్యూరోసర్జన్లను, ఎముకల డాక్టర్లను ఇంటర్వ్యూ చేసిన సర్వే లాన్‌సెట్ (Lanset) వైద్య పత్రికలో నమోదుఅయింది. ఇందులో అధిక భాగం డాక్టర్లు కృత్రిమ సరఫరాను నిలిపి వేయడమే మంచిదనే నిర్ణయానికి వచ్చారు. కాని ఇదే సమయంలో న్యాయస్థానాలు అలా చేయడం తగదు అంటున్నాయి. చాలమంది డాక్టర్లు అది తరుణవ్యాధియా? దీర్ఘవ్యాధియా అని,ఆలోచించి, ఒక నిర్ణయానికి రావాలన్నారు. ఇటు వంటి నిర్ణయాలను తీసుకోవడానికి డాక్టర్లను అనుమతిస్తూ పార్లమెంట్ ఒక చట్టం చేస్తే బాగుంటుందని సూచించారు.

ఇంగ్లాండ్‌లో టోనీబ్లాండ్ అనే ఆయన ఫుట్‌బాల్ స్టేడియంలో .తొక్కిసలాటలో నలిగిపోయాడు. అది ఆశవదులుకొన్న కేసుగా నిర్ణయించారు. ఈ విషయంలో బ్రిటన్ పార్లమెంట్ ఎగువ సభ- ఇదే అత్యున్నత న్యాయస్థానం - కృత్రిమ సరఫరాను నిలుపుచేయడం చట్టసమ్మతం కాదనలేమని ప్రకటించింది.

***సంపాదకుడు.***

తోడ్పడుతున్నట్లు చెప్పాడు. అయితే ఈ విషయం ఆయన ఎవరికీ తెలియనీయలేదు. ఇలా రోగుల మరణానికి సహాయపడడాన్ని "Mercy Killing" ''దయా మరణం ప్రసాదం'' అంటున్నారు. ఇలాంటి దయా మరణ ప్రసాదానికి పాల్పడే వైద్యులు అక్కడక్కడ లేకపోలేదు. ఇది బయటకు పొక్కితే నేరం, చట్ట విరుద్ధం. ఆస్ట్రేలియా ఇది నేరం కాదని ఈ మధ్యనే చట్టం చేసింది.

మనిషికి జీవించే హక్కు ఉన్నప్పుడు, ప్రాణం తీసుకొనే హక్కు ఎందుకు లేదు? అందులోనూ, ఇతరులకు భారం కాకుండా, నరకయాతనలను అనుభవించకుండ, ఇతరుల ఛీత్కారాలకు ఈసడింపులకు గురికాకుండా, ''వీడికి సేవలు చేయలేక ప్రాణాలు పోతున్నాయనే'' మాటలు చెవినపడకుండ జీవితాన్ని చాలించే హక్కు ఎందుకులేదు.

ఆత్మహత్య, మరణానికి దోహదం చేసే చర్య - రెండూ చట్టరీత్యా నేరాలే. ''మానవునిలో దైవాంశ ఉంది గనుక, మనిషిని చంపడం మహా పాతకం,'' అని మతాలు వాకొంటున్నాయి. అలాగైతే గర్భస్రావం మాటేమిటి? జనాభా నియంత్రణకోసం గర్భస్రావం చట్టబద్ధమైంది. అజాత శిశువు ప్రాణియే కదా. అటువంటి శిశుహత్య, హత్యకాకుండా పోతుందా? దీనిని చట్టబద్ధం చేసినప్పుడు ''దయామరణ ప్రసాదా''న్ని గూడ చట్టబద్ధం చేయవచ్చుగదా!.

''రోగి తెలివిలో ఉండి, దయా మరణాన్ని ప్రసాదించమని డాక్టర్ని అర్థిస్తే, (1) రక్తనాళాలలోకిఎక్కించేగ్లూకోజును ఆపివేయడం (2) ప్రాణవాయువు సరఫరాను నిలుపుచేయడం (3) బాధను నివారించే మత్తుమందుల మోతాదు బాగా పెంచడం (4) రసాయనిక చికిత్స (Chemotherapy) ను ఉపసంహరించడం - లాంటి ప్రక్రియల ద్వారా, అతనిని మృత్యు సన్నిధానానికి చేర్చడం చట్టబద్ధమే'', నని అంది అమెరికాలోని శాన్ ఫ్రాన్ సిస్కో సర్క్యూట్ కోర్టు. కొంతమంది పరపతిగల పౌరులు డాక్టర్లు యుథినేసియా (Euthenasia = నయంకాని రోగులకునెమ్మదిగా చల్లగా మరణాన్ని తెప్పించడం) నేరమని, వైద్యనీతికి విరుద్ధమనికేసువేశారు. Second circuit court of Appeals Sanfrancisco prohibited physicians from helping their patients die, when patient is in final stages of terminal diseatse".

న్యూ ఇంగ్లాండ్ జర్నల్ ఆఫ్ మెడిసిన్ ఒరెగాన్‌లో ఒక ఆసక్తికరమైన సర్వేని జరిపింది ఈ సంవత్సర ఆరంభంలో. ఆసర్వేలో 67% డాక్టర్లు ఆఖరిదశలో ఉన్న రోగులకు దయామరణం ప్రసాదించడం అవసరమన్నారు. 7% మంది అప్పటికే తాము ఆపని చేస్తున్నట్లు అంగీకరించారు. పైకి చెప్పడం లేదుకాని సహాయపడేవారి సంఖ్య ఇంకా ఎక్కువే ఉంటుందనే అభిప్రాయం ఉంది. వారు రహస్యంగా చేస్తున్నది వివిధ దేశాలలో బాహాటంగానే ఊపు అందుకొంటున్నది. ఆస్ట్రేలియాలోని డార్విన్‌వాసి అయిన వార్నిక్ ష్టెన్లే అనే పాత్రికేయుడు జరిపిన అభిప్రాయసేకరణలో నూటికి70మంది మరణశాసనా (Death Bill) నికిసుముఖత చూపుతున్నారు. వారుగౌరవమరణ చట్టాన్ని(death with dignity law) సమర్థిస్తున్నారు. ఈ విధంగా ''దయా మరణ ప్రసాదం'' పై ఎక్కువగా పాశ్చాత్య దేశాలలో చర్చ కొనసాగుతోంది.

''దయా మరణ ప్రసాదం'' డాక్టర్ల సహాయసహకారాలతో జరగాలనే పద్ధతి మంచిది కాదని కొందరంటున్నారు. ఎందుకంటేఈ ''దయా మరణ ప్రసాద'' ఆయుధానికి ఇరువైపుల పదును ఉంది. డాక్టరు సజ్జనుడైతే మంచిదే, మరి అలా కానప్పుడు దుర్వినియోగం జరుగుతుంది. దీనిని అధిగమించడానికి ఒక పర్యవేక్షక సంఘం ఉండవలసిన అవసరం ఉంది. ''దయా మరణ ప్రసాదా''న్ని ఎవరు అనుమతించాలి? ఎవరు నిర్ణయం తీసుకోవాలి? ఏ సమయంలో నిర్ణయం తీసుకోవాలి? దీనికి చట్టబద్ధత ఏమిటి? - అనే ప్రశ్నలకు ఆసంఘం ఆధ్వర్యములో సమాధానాలు రాబట్టాలి. ఆ సంఘంలో ఫామిలీ అడ్వకేట్‌లు ఉండాలి.

రోగి తెలివిలో ఉన్నప్పుడైతే అతడే యుథినేసియాకు అర్థిస్తాడు. దానిని కమిటీ అంగీకరించవచ్చు. రోగి తెలివిలో లేనప్పుడు? కమిటియే నిర్ణయిస్తుంది, రోగి ఆత్మీయులతో సంప్రదించి. రోగి తాత్కాలిక బాధకు తాళలేక మరణాన్ని కోరుతున్నాడా అనేది జాగ్రతగా ఆలోచించాలి.

గర్భస్రావాన్ని అనుమతించే చట్టం, బాధతో సతమతమయ్యే, ఎప్పటికీ స్వాస్థ్యంచేకూరని వ్యాధులతో బాధితులయ్యే రోగులకు ''దయా మరణ ప్రసాదా''న్ని అందించడం న్యాయం కాదా!

# యంత్రాలు ఆలోచించగలవా?

- కాకాని చక్రపాణి

- డా॥ డి. చం

వైజ్ఞానికశాస్త్ర పురోగతి మానవమేధోపరిణతికి సవాలవుతోంది. ఇప్పటిదాకా యంత్రాలు మానవుడికి అవయవాల్లా (limbs) పనిచేశాయి. కంప్యూటర్లయుగం ప్రారంభమవటంతో మానవుడి మెదడు చేసే పనికూడా చేయటం ప్రారంభించాయి. ఇంటర్‌నెట్ సాయంతో స్టాక్ ఎక్స్చేంజి ధరలను కనుక్కోవటం లాంటి చిన్నపనులతో సహా, పరిశోధనలో వలసిన వస్తుసంచయాన్ని కూడా అందిస్తూ మానవుడికిఎంతో సాయపడుతున్నాయి. మానవమేధస్సుతో తులతూగే కంప్యూటర్లు ఆవిర్భవిస్తున్నాయి. అయినా ప్రశ్న మిగిలిపోతూనే వుంది - యంత్రాలు మానవుడిలా ఆలోచించగలవా? - అని.

కృత్రిమమేధోసృజనలో ఎంతో మంది వైజ్ఞానికులు తీవ్రమైన కృషిచేస్తున్నారు. కొంతమంది సంప్రదాయపద్ధతిలో ఆ ప్రయత్నాలు చేస్తూవుంటే, మరికొంత మంది ప్రకృతి పరిణామక్రమాన్ని అనుసరిస్తున్నారు. సంప్రదాయపద్ధతి హేతువాద పద్ధతిని అనుసరిస్తోంది. మనం ప్రపంచాన్ని అవగాహన చేసుకునే సహాయక నిర్మాణాలను తెల్సుకోగలిగితే కృత్రిమ మేధస్సును నిర్మించటంలో మనం సగం కృతార్థులమైనట్లే. అలాంటిదే డగ్లాస్ లెనెట్ సృజించిన CYC - computer program. పదేళ్ళపైగా CYC - టీం ( ఆస్టిన్, టెక్సాస్) మానవ సాధారణ ప్రజ్ఞ (Common sense- Human Consensus Reality)ను కంప్యూటర్‌కు నేర్పాలని ప్రయత్నంచేస్తోంది. ఉదాహరణకు 'బ్రెడ్ అంటే ఆహారం', 'నీకు చెమట పోసినప్పుడు నీ వళ్ళు తడి అవుతుంది' లాంటి లక్షల నియమాలను దానిలో ప్రోగ్రాం చేయటం జరిగింది. అలాంటి మరో లక్ష నియమాలను అది నేర్చు కున్నప్పుడిక దానికి స్పూన్ ఫీడింగ్ అక్కర్లేదని లెనెట్ అంటాడు. ఆ కంప్యూటర్ ఎన్‌సైక్లోపీడియానే స్వాహా చేసి, ఇంకా తనకేమైన తెలియని వుంటే చెప్పమని ప్రశ్నలడగటం ప్రారంభిస్తుంది.

రాడ్నీ బ్రూక్స్ సృజించిన కంప్యూటర్‌పేరు COG. లోహం, ప్లాస్టిక్, సిలికాన్లతో మనిషిని పోలినట్లు తయారైన యంత్రం అది. దానికళ్ళ స్థానంలో కెమేరాలు, మెదడు స్థానంలో ఎనిమిది 32- బిట్ల మైక్రోప్రోసెసర్లు అమర్చబడి వున్నాయి. బ్రూక్ స్పూన్ ఫీడింగ్‌కి వ్యతిరేకం. జీవగత నిర్మాణాల పట్ల స్పందించి ఆయన ఈ రోబట్‌ను సృజించాడు. పిల్లలు ఇతర మానవులు, పరిసరాలు, వస్తువుల సంపర్క ప్రభావంతో అవగాహనను పెంచుకుంటారు. అలాగేఈ కంప్యూటర్ కూడా మానవ, వస్తు సంపర్కంతో ప్రోగ్రామింగ్, రీప్రోగ్రామింగ్ చేసుకుంటూ సేంద్రియ జీవిలా అవగాహనను పెంచుకుంటుంది.

ఓ సంకుచిత పరిధిలో ఓ రంగానికి సంబంధించిన ప్రావీణ్యం వుండేటట్లు కంప్యూటర్ల నిర్మాణంచేయటం కూడా జరుగుతోంది. ఉదాహరణకు రోగనిదానం చేయటానికి, చదరంగంలో ప్రావీణ్యంవున్న కంప్యూటర్లను నిర్మించటమూ జరుగుతోంది. ఫిబ్రవరి 96లో ప్రపంచ ప్రఖ్యాత

చదరంగపు ఆటగాడు గారీకాస్పరావ్ ప్రప్రథమంగా ఆలోచించే యంత్రంతో పోటీపడటం జరిగింది. అది ఆయనకూ ఓ IBM కంప్యూటర్‌కూ మధ్యజరిగిన చదరంగపు పోటీ. ఆయంత్రంపేరు డీప్ బ్లూ. నిజానికి అది కాస్పరావ్ కీ యంత్రానికీ మధ్య జరిగిన పోటీ కాదు. యంత్రానికీ మానవుడికీ మధ్య జరిగిన పోటీ. మానవ ప్రతిష్ఠను పరిరక్షించే నిమిత్తం కాస్పరావ్ మనందరి తరపున ఆడిన ఆట అది. డీప్ బ్లూతో జరిగిన ద్వంద యుద్ధంలో ఆయన చావుతప్పి కన్ను లొట్ట బోయిన పరిస్థితిలో గెలుపు సాధించగలిగాడు.

''డీప్ బ్లూ ముందు గడిలోకి పావును జరిపింది. దీనికేం రక్షణ లేదు. చంపేయటం చాల తేలిక. ఆ ఎత్తు చాల అద్భుతమైందీ, మానవులకు మాత్రమే తోచ గలిగేది. నేను కనుక తెల్ల పావులతో ఆడుతున్నట్లయితే. నేనా పావును త్యజించటానికే సిద్ధ పడేవాడిని. దాంతో నల్ల పావుల

చదరంగం ప్రపంచ విజేతను ఒకకంప్యూటరు ఓడించడమంటేమనం సుతరాము అంగీకరించం. యంత్రంతో రెండుసార్లు ఓటమి చవిచూసి, మూడోసారి గెలిచాడు. ఇందులో ఉన్న విరోధాభాస వేయగలదు. ఇదే ఇతి వృత్తంతో ఎంతో శాస్త్రీయ కాల్పనిక సాహిత్యం (Scientfic fiction) తీసిన 2001 Space Odyssey చిత్రం ప్రస్ఫుటం చేస్తుంది. ఈ సినిమాలో సర్వశక్తిమంతమైన కు సంబంధించిన అన్నిరకాల ప్రకార్యాలను చేబడుతుంది. ఎందుకంటే ఆ నౌకను నడపడంలో,

అదృష్టం ఏమిటంటే, మనిషికి ఉన్న ధైర్యసాహసాలు గాని, అతని అసాధారణ మేధగాని ఎందుకంటే జీవితమంటే ప్రజ్ఞ ఒక్కటే కాదు, సంకల్పం, సాహసకృత్యాల సమ్మేళనం.

కృతక ప్రజ్ఞకు స్వేచ్ఛలేదు. ఉదాహరణకు చదరంగంలో ''డ్రా'' ప్రతి పాదనకు అంగీకరించాలో సన్నివేశాల మీద ఆధారపడ వలసిందే. ఎందుకంటే లెక్కలు ఎప్పుడూ పరిమిత సంభావ్యతల మీదే సమస్యలను పరిష్కరిస్తుంది. దాని సామర్థ్యం అపరిమేయం. అంతిమంగా ఒక కంప్యూటరు కూరుస్తున్నా, అవి సృజనాత్మకాలు కాలేవు: మానవ మేధకున్న అనుభవం, స్మృతి, అనుభూతి, ఏ రోజు విజ్ఞాన శాస్త్రం సృష్టిస్తుందో, ఆరోజు మనం నిజంగా కలత చెందే రోజు అవుతుంది.

నిర్మాణం భగ్నమై పోయి, తెల్ల బలాల దాడికి అవకాశం కల్గేది..... అందువల్ల కంప్యూటర్ పావును త్యజించ ప్రయత్నించటం చూసి నేను దిగ్భ్రమలో పడిపోయాను. దాని అర్థమేమిటి? నేనంతకు ముందు ఎన్నో కంప్యూటర్లతో ఆడాను. కాని ఇలాంటి అనుభవ మెప్పుడూ కలగలేదు. టేబుల్ ఎదురుగుండా నాకో నవ్య మేధో పరిణతి దర్శనమిచ్చింది.'' అన్నాడు కాస్పరావ్.

అలా కంప్యూటర్ మానవుడి సత్వాన్నీ, సత్తానీ, గుర్తింపునూ సవాలు చేసింది. యంత్రమే మానవుడైతే, మానవుడి మనుగడ యంత్రస్థాయికి దిగిపోతుందా? మరి మానవుడికిగుర్తింపేమిటి? మీరింకో ప్రశ్న వేయవచ్చు - యంత్రాలకు ఆత్మాలున్నాయా అని. నిజమే, యంత్రాలకు

ఆత్మలున్నట్టు ఏ వైజ్ఞానికుడూ, తత్త్వవేత్తా చెప్పటంలేదు. ప్రస్తుత తత్త్వవేత్తలు మానవుల అభౌతికలక్షణాన్ని గురించి మాట్లాడుతున్నా, 'ఆత్మ'ల గురించి ప్రస్తావించటంలేదు; 'చేతన', 'బుద్ధి'ల గురించి ప్రస్తావిస్తున్నారు. మరికొంత వైజ్ఞానిక ప్రగతి సాధించినపుడు ఈ యంత్రాలు కూడా మరింత 'బుద్ధిని', 'చేతన'ను సంతరించు కుంటాయా? డేవిడ్ ఛామర్స్ తనురాసిన పుస్తకం "The conscious Mind" లో ''మనం కంప్యూటర్లగురించి ఆలోచించిన కొద్దీ చేతన (consciousness) అనేది ఎంత విచిత్రమైందో మన కర్థమవుతుంది'' అంటాడు.

1950లో ఎలాన్ టర్నింగ్ 'యంత్రాలు ఆలోచించగలవా'? (Can Machines Think) అన్న వ్యాసంలో యంత్రాల మానవత్వాన్ని కొల్చే ప్రామాణిక పరీక్షను రూపొందించాడు. దీన్నే 'టర్నింగ్ టెస్ట్' అంటారు. ఓ ప్రాశ్నికుడు అజ్ఞాతవ్యక్తులతోను, కంప్యూటర్లతోను

యినా కాస్పరోవ్, మూడు నిముషాలలో 50 బిలియన్ల ఎత్తులు వేయగల డీప్ బ్లూ అనే ఐబియమ్ మిటంటే, మానవ మస్తిష్కం తన కంటె ఎంతో గొప్పదైన వస్తువును సృష్టించి తన స్థానాన్ని దానికి ఇచ్చి చ్చింది. ఈ సాహిత్యంలో యంత్రాలు మానవమేధను తోసి రాజంటాయి. ఈ విషయాన్ని స్టాన్లీ కుబ్రిక్ HAL అనే కంప్యూటరు - ఈ యంత్రం చదరంగం గూడ బ్రహ్మాండంగా ఆడుతుంది - ఒక వ్యోమనౌక దాని ప్రకార్యాలను నిర్వర్తించడంలో మానవులు తగరని భావించడం జరిగింది.

కంప్యూటరుకు లేవు. కుబ్రిన్ సినిమాలో HAL కంప్యూటరు జీవిత చదరంగంలో కట్టి పోతుంది.

ల్లేదో చెప్పలేదు. దీనిని గూడ శాస్త్రజ్ఞులు అధిగమించారను కొన్నా కంప్యూటరు ఎప్పుడూ గూడ పరిమిత ఆధారపడతాయి. అదే మానవ మేధ అయితే అంతకుముందు కాలం నుంచి అ పరిష్కృతంగా వస్తూ ఉన్న నకంటె ఉన్నతమైన, గొప్పదైన కంప్యూటరును సృష్టించ లేదు. కంప్యూటర్లు పద్యాలు రాస్తున్నా సంగీత రికరంతోడి, ప్రతిస్పందనా వైవిధ్యాలు, కృత్రిమ ప్రజ్ఞకు అంటే కంప్యూటరుకు లేవు. మరో గారీ కాస్పరోవ్ను

**సంపాదకుడు**

మాట్లాడేటప్పుడు ఏది ఎవరో చెప్పగలగటమే ఈ పరీక్ష. ఓ కంప్యూటర్ ప్రాశ్నికుణ్ణి ఫూల్ చేయగలిగిన మేరకు కంప్యూటర్ ఆలోచించగలదని చెప్పవచ్చు. అయితే ఇంతవరకూ ఏ కంప్యూటర్ కూడా మనిషిని పూర్తిగా ఫూల్ చేయలేక పోయింది. కంప్యూటర్లు గొప్పగా చదరంగం ఆడగలవు; పెద్ద పెద్ద లెక్కలు క్షణంలో చేయగలవు. అయితే, అవి పోచికోలు కబుర్లు చెప్పలేవు, మనిషి ముఖం గుర్తుపట్టలేవు. హాస్యాన్ని గుర్తించలేవు. మెస్సాచెట్స్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన మార్విన్ మిన్స్కీ అన్నట్లు కంప్యూటర్లకు కామన్‌సెన్స్ కల్గించటం చాల ఎన విషయం.

కొత్త శతాబ్దంలోకి అడుగిడబోతున్నాం. ఇంతవరకు విజయవంతంగా టర్నింగ్ టెస్ట్‌ను పాసయిన కంప్యూటర్ లేదు. మనం మనిషిమెదడు గురించి ఆలోచించేటప్పుడు నరాల్లో ర ప్రవాహానికి అనుగుణంగా మనకు ఆలోచనలు, భావాలు కల్గటమేకాదు, అసలా ఆలోచనలు, భావాలను కూడా పరిగణలోనికి తీసుకోవల్సి వుంటుంది. ఓ ఆటగాడు ఆటలో ఓడిపోతే విచారంలో మునిగిపోతాడు. మరి అలాగే కంప్యూటర్లు అపజయాన్ని ఎదుర్కొన్నప్పుడు విచార పడతాయా? మరి డీప్‌బ్లూ కంప్యూటర్ కు అలాంటి భావావేశం వుందా? మానవ మస్తిష్క సమాచార ప్రవాహానికి ప్రతిగా కంప్యూటర్లలోనూ సమాచార ప్రవాహంవుండొచ్చు. కాని అవి మానవుడిలా వైయక్తిక అనుభవాన్ని పొందగలవా?

కృత్రిమ మేధస్సును సృజించే పరిశోధకులు కంప్యూటర్లకు భావన, స్పందన వున్నాయా అన్న అంశాన్ని గూర్చి పరిశీలిస్తున్నారు. కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో తత్త్వశాస్త్రోపాధ్యాయుడైన ఛామర్స్ లాంటి వాళ్ళు చేతన అనేది తత్త్వవేత్తలు ఇంతవరకు భావించిన దానికంటే కుడా పెద్ద పజిల్ అనీ, మర్మ పూర్ణమనీ భావిస్తున్నారు. అయితే మెస్సాచెట్స్ విశ్వవిద్యాలయానికి చెందిన డానియల్ డన్నెట్ లాంటి వాళ్ళకు చేతన అనేది అంతమార్మిక మైందీ, రహస్యపూర్ణ మైందీ అని అనిపించటం లేదు. మానవుడి బుద్ధి, మెదడు మార్మిక మైందా, కాదా అన్న వివాదానికి మూలం ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయానికి చెందిన డన్నెట్ గురువుగారు - గిల్బర్ట్ రైల్ 1949లో ప్రచురించిన పుస్తకం "The concept of Mind'. అందులో ఆయన మానవుడికి ఆత్మవుందనే సిద్ధాంతాన్ని ఖండించాడు. అది శాస్త్రీయ ఆలోచనలకు పూర్వమున్న భావంగా ఆయన దాన్నితోసిపుచ్చాడు. ఆ పుస్తకంలో ఆత్మలాంటి అతీత ప్రకృతికి అంతగా సంబంధించని బుద్ధి, చేతన, వైయక్తిక అనుభవం లాంటి వాటి విషయాలలో కూడా ఆయన అంత కుతూహలాన్ని వ్యక్తపరచలేదు. రైల్ ప్రతిపాదించిన 'భౌతిక వాదా'న్ని అనుసరించేవాళ్ళు కొందరు ఇలాంటివి లేవన్నారు, మరికొందరు వున్నాయన్నారు. అయితే, వాటి అస్తిత్వాన్ని అంగీకరించినవాళ్ళు అవి ఎక్కడో లేవు, మెదడులోనే వున్నాయన్నారు. అంటే వాళ్ళ ఉద్దేశంలో బుద్ధి అనేది మేదడే, యంత్రమే. అయితే మనబోటి మామూలు మనుషులకు ఈ రెండు వాదాల్లోనూ విభేదం కన్పించదు.

అయితే, డన్నెట్ కృత్రిమ మేధో సృజన ప్రగతి సాధిస్తోందనీ. మనుష్యులు వ్యవహరించే తీరున వ్యవహరించే సూక్ష్మ యంత్రాలు వస్తున్నాయనీ, ఈ ధోరణే కనుక కొనసాగితే, త్వరలోనే మనం కూడా యంత్రాలమే అన్న విషయం స్పష్టమవుతోందనీ అన్నారు. 1991లో డన్నెట్ ప్రచురించిన "Consciousness Explained' అన్న పుస్తకంలో ఈ వివరణ ఇచ్చారు. అయితే, "The Problem of Consciousness' రచయిత, న్యూజెర్సీకి చెందిన కోలిన్ మెక్‌గిన్, డన్నెట్ అభిప్రాయాన్ని ఖండించారు. మెక్‌గిన్, ఛామర్లకు చేతన మార్మికత్వంతో నిండివున్నదిగా భాసించింది; అంతేకాదు చేతన ఎప్పటికీ రహస్య పూర్ణంగానే వుండిపోతుందని వాళ్ళు వాదిస్తారు. అందువల్ల వాళ్ళను నవ్యమార్మికతా వాదులుగా పరిగణించటం జరుగుతోంది.

అయితే, ఈ నవ్యమార్మికతావాదులకూ, మానవానుభూతులు శాస్త్రీయ శస్త్ర చికిత్సకు లొంగవని భావించే మరికొంతమంది మార్మికవాదులకూ భేదం వుంది. నవ్యమార్మికవాదులు ప్రాథమికంగా శాస్త్రీయ దృక్పథం కల్గినవాళ్ళు; కృత్రిమ మేథస్సు ప్రాతిపదికనే వాళ్ళు శంకాభావంతో చూడడంలేదు; బహుశా కృత్రిమ మేథో సృజన సంభవమేనని వాళ్ళంటారు. ఉదాహరణకు MIT కృత్రిమ మేధో పరిశోధనాలయంలో తయారయిన రోబట్ -COG ఎప్పుడో ఒకరోజు స్పర్శకు స్పందించే చర్మపు పొరను సంతరించుకోవచ్చు; స్పర్శ సమాచారాన్ని చర్మం మెదడు కందించగానే రోబట్ మెదడు హాని, కీడు సంభవిస్తుందని భావించినపుడు రోబట్‌ను ఆ వస్తువునుండి వైదొలగమని ఆదేశం పంపవచ్చు. ఇదే విధంగా మానవుడిలోనూ జరుగుతుంది. అందువల్ల, COG మానవుడి మనస్సు, సమాచారాన్ని పరిశీలించే విధానాన్ని చూపే చక్కటి నమూనా. అలా మానవ చేతనను విపులీకరించటం జరిగిందని మరి వివాదం అనవసరమనీ డెన్నెట్ విశ్వసించాడు.

కానీ, ఛామర్స్ దాన్ని అంగీకరించడు. వేడివస్తువునుపట్టు కున్నప్పుడు మానవుడి మెదడు ఆ వస్తువును తాకవద్దని ఆదేశిస్తుంది. ఇంతవరకూ బాగానేవుంది. భౌతిక సమాచార వినిమయం రోబట్‌లోనూ, మనిషిలోనూ ఒకేవిధంగా జరుగుతుంది. అయితే మానవుడి కనుభూతమయ్యే వేడిని గురించిన భావన, అందువల్ల కలిగే బాధ రోబట్‌కు కల్గుతాయా? మనిషికా వైయక్తికానుభూతి, చేతన వున్నాయి. కనుక ఒట్టిగా COG అధ్యయనం వల్ల ఆ ప్రశ్నకు సమాధానం లభించదు. సమస్యమరింత జటిల మవుతుంది. రోబట్ చేసేవన్నీ భౌతికంగా విశదపర్చవచ్చు. అలా మానవుల విషయంలో సాధ్యంకాదు. అందువల్లే మానవ చేతనలో 'అదనపు' దేదో వుంది అన్నాడు ఛామర్స్.

మానవ జీవన స్రోతస్సుకు అర్థం కల్పించేదీ - ఆనందం, దుఃఖం, ప్రేమ, విషాదం లను కల్పించేది-చేతనే. ఈ 'చేతన' అదనపుది కాకపోయే అవకాశం వుంది. అంటే భౌతిక ప్రపంచంలో దానికేదో అస్తిత్వం వుండివుండవచ్చు. ఈ 'అదనపు' సమస్య 'చేతన'ను విపులీకరించటంలో వుండే 'దుష్కర'మైన ప్రశ్న. ఛామర్స్ ఉద్దేశంలో డెన్నెట్ ప్రయత్నం ఈ 'దుష్కర' ప్రశ్నను వదిలేసి 'తేలికైన' ప్రశ్నలపై దృష్టి బరపటం. ఛామర్స్ దృష్టిలో డెన్నెట్ వదిలేసిన మరో 'దుష్కర'మైన వుంది. 'పాండమోనియం' అనిదాని పేరు.

ఈ 'పాండమోనియం' నమూనా ప్రకారం మానవుడి మెదడు, అధోచేతన (subconsciousness)లో ప్రపంచాన్ని గురించి విరుద్ధమైన సిద్ధాంతాలను సృజిస్తుంది. అందులో 'విజయం' పొందిన సిద్ధాంతం చేతనలో భాగమవుతుంది. ఉదాహరణకు అది మనిషి దృష్టిలోపడిన దగ్గర్లో వున్న ఈ గో, లేక దూరంగా కనిపిస్తున్న విమానమ్మోకావచ్చు; పిల్లవాడు ఏడవటం కావచ్చు, లేక పిల్లి మ్యావ్‌మ్యావ్ అనటం కావచ్చు. పోటీలో గెల్చి విజేతగా నిర్ధారింపబడినపుడు మనకీ దృశ్యాలు, శబ్దాలు అవగతమవుతాయి. అందే సమాచారానికి దగ్గరగా ఉంటే సిద్ధాంతం విజయాన్ని పొంది, మన న్యాతానపై అదుపు సంపాదించి మన జ్ఞానక్షేత్రాన్ని అధివసిస్తుంది. శాస్త్రీయ నమూనా అవటం వల్ల పాండమోనియంలో రెండు సుగుణాలున్నాయి.

ఒకటి - అది ఫలితం చూపెడుతుంది. మనం కంప్యూటర్ మీద నమూనాను సంభవింప చేయవచ్చు. రెండు - మెదడు నిర్మాణాన్ని పోలిన పెద్ద సమానాంతర కంప్యూటర్ల మీదకూడా ఇది చక్కగా పనిచేస్తుంది. అందువల్ల ఈ నమూనా, మానవుడి మెదడులో జరిగే సమాచార ప్రవాహం గూర్చి, మెదడు ఏదో ఒక సమాచారాన్నే కానీ, మిగతా సమాచారాన్ని చేతనకు చేరనివ్వని ప్రామాణికతను గూర్చి మనకు నమ్మ శక్య మయ్యే సిద్ధాంతాన్ని అందిస్తుంది.

అయితే, ఎలాంటి సమాచారం చేతనలో భాగమవుతుంది, అది ఎలా అలాంటి అధికారాన్ని పొందగలిగింది అని తెల్సినా, ఎలా అది చేతనలో భాగమవుతుంది అన్న ప్రశ్న మిగిలిపోతుంది అంటాడు ఛామర్స్. ఉదాహరణకు పిల్లవాడు ఏడవటం అనే సమాచారం చేతనలో మిగిలిపోయి, పిల్లి మ్యావ్ మ్యావ్ అనే సమాచారం మరుగున పడిపోయింది అనుకోండి. ఎలా ఏ భౌతిక, భౌతికాతీత రసాయనం వల్ల భౌతిక సమాచారం పిల్లవాడు ఏడవటం అనే వైయక్తిక అనుభవ మైంది. ఎలా మెదడు నీళ్ళని ద్రాక్ష సారాయం చేయగలదు'' అని ప్రశ్నిస్తాడు మెక్‌గిన్.

వాచ్యంగా వైయక్తిక అనుభవం - ఓ మిరకల్ - ఓ అద్భుతమనుకోడు మెక్‌గిన్. ఆయన తను భౌతికవాది నంటాడు. మానవుడి మెదడుగాని, బుద్ధిగాని- మరేదైనా దాన్ని ఎప్పటికీ తెలుసుకోలేక పోయినప్పటికీ, ఈ వైయక్తిక అనుభవానికి ఏదో భౌతిక వివరణ వుందని ఆయను కుంటాడు. వీటిని ద్రాక్ష సారాయంగా మార్చే అలంకారాన్ని వాచ్యంగా స్వీకరించే మనుషుల్ని చూసి నవ్వడు మెన్‌గిన్. ''చేతనా మార్మికతను మతపరమైన పద్ధతిలో అర్థం చేసుకోటం సహేతుకమే నిజానికి. పూర్తి భౌతిక వాద పరంగా కంటే ఓ రకంగా దాన్నలా స్వీకరించటం హేతుబద్ధమే ''అంటాడు ఆయన. అంటే సమాచార అభావాన్ని అది గుర్తించటమవుతుంది, శాస్త్రీయ అవగాహనలో వున్న గండి (gap) ని గౌరవించటం మవుతుంది.

చేతనను గురించినఈరెండు 'దుష్కర' ప్రశ్నలు - అదనపు ప్రశ్న, నీటిని ద్రాక్షసారాయంగా మార్చే ప్రశ్నా - కృత్రిమ మేధస్సుపై ఆధారపడిలేవు. మెదడును యంత్రంగానూ, అపై దాని ఫలితాలను గూర్చి భావించే మనుషులకు అవి ఎదురయ్యే సమస్యలే. COG లాంటి రోబట్ గాని, పాండమోనియం లాంటి యంత్రాల వాస్తవ నిర్మాణం ఈ దుష్కర ప్రశ్నలను మరింత బాహిరపరుస్తాయి. భౌతికవాది మనస్సు - శరీరం అనే సమస్యను తోసి వేయటం కాయితంమీద చాల గొప్పగా కన్పిస్తుందికాని ''అది రూపం పొందటం మొదలవగానే దాని పరిమితులను నువ్వుచూడటం ప్రారంభమవుతుంది'' అని అంటాడు మెక్‌గిన్. కృత్రిమ మేధస్సు ఖచ్చితంగా భౌతిక వాద సూత్రాలను అవగాహన చేసుకుంటోంది. కానీ మానవ అనుభవ భాగాన్ని మాత్రం వివరించ నశక్తమవుతోంది.

ఇలాంటి విమర్శకు డెన్నెట్ దగ్గర సమాధానాలున్నాయి. అదనపుసమస్య విషయంలో చేతన ఎలాంటి ప్రయోజనాన్ని సాధిస్తోంది అన్న ప్రశ్నే సమాధానమిస్తోంది. మీరు సంపూర్ణంగా భౌతికవాది అయితే, 'బుద్ధంటే మెదడే' నని నమ్మే వాళ్ళయితే, అప్పుడు చేతన కో

ప్రయోజనముండాలి. నిజానికి మెదడు కో ప్రయోజనం, పని వుంది. కనుక చేతనే మెదడు. అలాగే నీటిని ద్రాక్షసారాయంగా మార్చటం అంత తీవ్రసమస్య కాదు, ద్రాక్షసారాయం నీరయితే.

డెన్నెట్ తాత్త్విక భావాలను అంగీకరించని వ్యక్తులకు ఈ వాదన అర్థం కాకపోవచ్చు. (ఛామర్స్, మెక్‌గిన్‌లు అన్నట్లు భావాలను మెదడు సృజిస్తుందని చెప్పటం బాగానేవుంది కానీ భావాలే మెదడు అనటం ఎంత వరకు సబబు.) అలా అని డెన్నెట్ అభిప్రాయం తప్పుకాదు. కొందమంది ఆయన అభిప్రాయాన్ని అంగీకరిస్తారు. అందువల్ల ఆయన విమర్శకూడా సుస్పష్టమే వాళ్ళకు. చేతనను గూర్చిన ప్రశ్న ఎంత గంభీరమైన దంటే కొన్ని అభిప్రాయాలున్న వ్యక్తులు వ్యతిరేక భావాలున్న వ్యక్తులకు - ఒకళ్ళనొకళ్ళు - సమాధాన పర్చటంలో అసఫలు లవుతారు; అంతేకాదు, తమ భావాల అభివ్యక్తిలో కూడా వాళ్ళు పరాజయం పొందుతారు. అర్థం కాని లోకం అనేది పారస్పర్యం.

ఛామర్స్ మెక్‌గిన్ అంత గట్టి మార్మిక వాది కాదు. చేతనా సమస్యకు పరిష్కారముందని ఆయన అభిప్రాయం. చేతనా పరిష్కారానికి ప్రాతిపదిక - చేతన అనేది అతీత భౌతికమని గుర్తించటం. ఆ తర్వాత సిద్ధాంతాన్ని నిర్మించ వల్సివుంటుంది. కొంతమంది దాన్ని అధి భౌతికమని పిలవవచ్చు. ఛామర్స్ అభిప్రాయంలో చేతన అనేది అస్పష్టంగా మాస్, స్పేస్, టైం అనే భౌతికధర్మాలతో పోల్చగల విశ్వపు అభౌతిక ధర్మం. బహుశ ఏదో విశ్వనియతి వల్ల, మెదడు లాగా, చేతన కొన్ని సమాచార సమామ్నాయాలను అనుసరించవచ్చు. సమాచారం సాధారణ ద్రవ్యంతో నిర్మితమైనప్పటికీ, అది ప్రత్యేక ద్రవ్యావతారం దాల్చివుండవచ్చు; దానికి రెండు పార్శ్వాలున్నాయి - ఒకటి భౌతిక, రెండు అనుభవాత్మకం. ఈ దృష్టిలో COG కి కూడా చేతన వుండి వుండవచ్చు, అలాగే పాండమోనియం యంత్రానికీ, ఓ ధర్మా స్టాట్‌కీ కూడా చేతన వుండి వుండవచ్చు. ఛామర్స్ అభిప్రాయం ప్రకారం, మనమెవరమూ ఇంతకు ముందు అనుభూతం చేసుకోని కొత్త చేతనా రంగాలను కృత్రిమ మేధస్సు సృజించే అవకాశం వుంది. మన మో కొత్త జీవుల స్పందనాజీవితాన్ని సృజిస్తున్నామని ప్రస్తుత తత్త్వ శాస్త్రం గట్టిగా భావించడం విచిత్రమనిపించవచ్చు. ఇలాంటి తాత్త్విక ప్రశ్నలకు టర్నింగ్ దూరంగా వున్నా, 1950లో ఆయన రాసినపత్రం ఈ విషయాన్ని సంక్షిప్తంగా స్పృశించడం జరిగింది. ఆలోచించే యంత్రాలను సృజించడం కొత్త ఆత్మలను సృజించటమవుతుంది. అది భగవంతుడికే కేటాయించబడ్డ అధికారాన్ని హస్తగతం చేసుకోవటం అని కొంతమంది గగ్గోలు పెట్ట వచ్చని ఆయన అభిప్రాయపడ్డారు. ''ఎలా అయితే మనం పిల్లల్ని కంటున్నామో, అలాగే అలాంటి యంత్రాలను నిర్మించడం మన మాయన అధికారాలను హస్తగతం చేసుకోవడం క్రిందకురాదు. అంతకంటే, రెండు సందర్భాల్లోనూ, ఆయన సృజించిన ఆత్మలకు భవంతులను నిర్మించే ఆయన అభీష్ట పరికరాలం మనం అంటే బాగుంటుంది.'' అన్నారాయన.

* * *

# కవిత్వంలో భావచిత్రాలు - కొన్ని అభిప్రాయాలు

- డా॥తక్కోలు మాచిరెడ్డి.

మనం దేన్ని గురించి రాస్తుంటామో దాన్ని అతిగా చెప్పుకోవడం జరుగుతూంటుంది. బింబ రచనను ( భావచిత్రాల్ని) గురించి రాస్తున్నపుడు దాన్ని కావ్యాత్మ అని కొందరు అన్నారు. మిహ ఈల్‌అప్సియాన్నికోవ్ బింబరచనను గూర్చి వెల్లడించిన ఈ క్రింది అభిప్రాయం అలాంటిదే. ఆయన అన్నాడు - ''తన ఆత్మ, అంతస్సారం, ప్రధాన లక్షణం బింబరచనే కావటం వల్ల కళ దాన్ని త్యజించ జాలదు.'' ఇపుడు మనం కళాత్మక బింబాల లక్షణాలేమిటో చూద్దాం.

కళాత్మక బింబాల్లో ఉద్వేగ పూరిత స్వరం (Emotional tone) ఒకటి వుంటుంది.

బింబరచన వస్తుగతమూ, ఆత్మగతమూ కూడాను. ఇది ఒక సంశ్లిష్ట నిర్మాణం. బింబము అర్థాన్ని వికసింపజేస్తుంది. కళాత్మక బింబాలు ఎపుడూ తాజాగానే వుంటాయి. కొత్తవి వచ్చినా పాత బింబాలు తమ సార్థకతనూ, ప్రాధాన్యాన్నీ కోల్పోవు.

ఒక ఉదాహరణ:

వాల్మీకి రామాయణం లోని ఈ శ్లోకం చూడండి.

రాముడు వనవాసంలో వాలిని చంపి సుగ్రీవునికి పట్టాభిషేకం చేసి మాల్యవత్పర్వతం మీద నివసిస్తూ లక్ష్మణునితో ఇట్లంటాడు:

సంధ్యారాగోత్థితై స్తామ్రైః అంతేష్వధిక పాణ్డురైః

స్నిగ్ధై రభ్ర పటశ్ఛేదైః బద్ధవ ణ మివాంబరమ్.

సంధ్యారాగం చేత మధ్య ఎర్ర గాను, చివర్లు అతి తెల్లగాను ఉన్న తడి మబ్బులనే గుడ్డ ముక్కలతో పుండుమీద కట్టు కట్టబడినట్లు ఉంది ఈ ఆకాశం.

పూర్తి కవితే ఒక బింబం కావచ్చు. ఒక కవిత లోనే అనేక బింబాల సమాహారం వుండొచ్చు. బింబరచనలో శబ్దార్థ తాదాత్మ్యం వుంటుంది. సౌందర్యానుభూతి - సామర్థ్యం బింబ రచనా శక్తిని ఇనుమడింపజేస్తుంది.

గద్యంలో కూడా బింబాలుండవచ్చు. ఛీనాదేవి నవల ''పుణ్యభూమీ కళ్లు తెరు'' బింబ - బహుళ నవల. కాని కవిత్వంలో లాగా కాకుండా వీటిని మరో విధంగా కూడా వ్యక్తీకరించవచ్చు.

బింబరచన, అలంకారాలు-

ఉపమ, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి లాంటి అలంకారాల్లో బింబం వుండే అవకాశం వుంది. ఉపమానోపమేయాలు సాధర్మ్యమున్నా, '' ఒకటి'' కావు గనుక, వీటిల్లో బింబం ఆంగికం (ORGANIC) కాకుండా కాస్త 'వేరు' గా వుంటుంది. రూపకాలంకారం ఒక బింబ పద్ధతి. యమకం, శ్లేష లాంటి అలంకారాల్లో కవిశిల్పకారిత కన్పిస్తుంది. రూపకం, ఉత్ప్రేక్ష లాంటి అలంకారాల్లో కవి సంవేదనశీలత, కమనీయ కల్పన కన్పిస్తాయి.

రూపకేతర అలంకారాల్లో-వచ్చే బింబాలు అలంకార చేతన కారణంగా విశుద్ధ బింబాలతో సరితూగలేవు.

ప్రతీకలు వస్త్వర్థకాలు - ఖచ్చితంగా "Denotative". బింబము అలా కాదు. బింబరచనలో ఒక విధమైన అనిశ్చితత్వం, ప్రవాహ శీలత కన్పిస్తాయి. ప్రతీకల్లో నిర్దిష్ట అర్థమే స్ఫురిస్తుంది. బింబాల్లో అలా కాదు - అవి సదా నూతనార్థస్ఫోరకాలు.

వస్తురూపాలను వేరు చేసి చూడటం అలవాటయింది మనకు. బింబరచన రూపము, వస్తువు కూడాను. సౌందర్యశాస్త్ర రీత్యా అది సంశ్లేషణ. (Synthesis). సోవియట్ సౌందర్యశాస్త్రవేత్త బత్రకోవా వస్తు రూపాలస్థానే సౌందర్యభావం (Aesthetic Idea) అనే భావనను ప్రతిపాదించింది. ఇందులో వస్తురూపాలు దాదాపు అభిన్నాలు. శ్రీ శ్రీ 'భిక్షువర్షీయసి' లాగా.

సాహిత్యం భావ సంప్రేషణం (Communication) కోసమేనని చాలమంది అనుకుంటుంటారు. ఇది తప్పు. కళాత్మక బింబాల ఉద్దేశ్యం సంప్రేషణం మాత్రమే కాదు: పాఠకుని మనసులో అర్థతరంగాల్ని రేకెత్తించడం. సంప్రేషణ అనేకార్థకంగా వుండదు. కాని బింబాలు అనేక అర్థఛాయలతో కూడి వుంటాయి.

బింబాలు అనేక అంశాల ఆధారంగా వర్గీకరింపబడినాయి. కాని, బింబవర్గీకరణం ఏదీ అంతిమం కానేరదు. సంవేదన ఆధారంగా బింబాల్ని దృశ్యబింబాలు, శ్రవ్య బింబాలు, ఘ్రాణ బింబాలు, స్పర్శబింబాలుగా వర్గీకరించవచ్చు. దృశ్య బింబాలు, ప్రత్యేకించి రంగ సంవేదన గల బింబాలు కవి వ్యక్తిత్వాన్ని తెలుపుతాయి. శ్రవ్య బింబాలు కవితల్లో ఎక్కువే. కవిత చదవగానే మొదట ఏర్పడేది శ్రవ్యబింబమే. అలాకాక కవితలో శ్రవ్య బింబాలుండవచ్చు శ్రీశ్రీ రాసిన ''గంటలు'' కవితలో లాగా. సహసంవేదనాత్మక బింబరచన (Synaesthetic Imagery) కవి పరిపక్వ సంవేదననీ, ప్రగాఢ అనుభూతినీ అభివ్యక్తం చేస్తుంది. ఉదాహరణకు శ్రీ రంగం నారాయణ బాబు రాసిన ఈ పంక్తులు చూడండి.

ఘల్లు! ఘల్లు

మట్టెల ధ్వని వెన్నెల!

ఇందులో దృశ్య బింబమైన వెన్నెలకూ, శ్రవ్యబింబమైన మట్టెల ధ్వనికీ మధ్య అన్వితి సాధించబడింది.

మరో ఆధారంగా, బింబాల్ని అనుభూతి ప్రధానం, కల్పనాత్మకం అని వర్గీకరించవచ్చు.

ఏది ఏమైనా, ఆధునిక కవితను అర్థం చేసుకోవాలంటే, ఆధునిక అనుభూతికి స్పందించాలంటే, బింబ అవగాహన చాల అవసరం.

* * *

# ఉత్కళ సాహిత్య నవయుగవైతాళికుడు ఫకీర్ మోహన సేనాపతి

- కె.ఎమ్.వి.జి.కృష్ణమూర్తి

20వ శతాబ్దపు పూర్వార్ధంలో తెలుగు భాష పుంఖాను పుంఖంగా దిగుమతిచేసుకున్నది ప్రధానంగా బెంగాలీ నుండే. శరత్ నవలలూ వెంకటపార్వతీశకవుల డిటెక్టివ్ నవలలూ తప్ప మనకు చెప్పుకోదగ్గ ఇతర భాషా సాహిత్య పరిచయంలేదు. ఇదే కాలంలో మనకు సొంతంగా కవితా, కథా సాహిత్యాలు కూడా ఏర్పడసాగాయి.

బెంగాలీ సాహిత్యంతో పోలిస్తే, మనకు పొరుగున ఉన్న ఒరియా సాహిత్యంతో పరిచయం దాదాపు శూన్యమనే చెప్పుకోవాలి. చాగంటి తులసిగారి కొన్ని అనువాద కథలూ, పురిపండా అప్పలస్వామిగారి ఒరియా సాహిత్య చరిత్ర తప్పితే మనకు మరో పుస్తకమే లేదు.

కాని ఒరియా సాహిత్యం ఎంతో ప్రాచీనమైనదీ సుసంపన్నమైనదీ కూడా. సరళాదాసు భారతానువాదం జగన్నాథ దాసు భాగవతం ఒరియా సాహిత్యపు ఆది గ్రంథాలుగా చెప్పుకోవచ్చు. మధ్యయుగంలో పద్య ప్రబంధ సాహిత్యాలున్నాయి. ధనంజయభంజ, లోకనాథ విద్యాధరుడు, ఉపేంద్ర భంజ వంటి కవి వరేణ్యులున్నారు. గోపీనాథ మొహంతీ 'దానాపానీ' నవల ద్వారా జ్ఞానపీఠపురస్కారాన్ని పొందాడు. ఇటీవలనే మాక్మిలన్ దాని ఆంగ్లాను వాదాన్ని కూడా వెలువరించింది. శీతాకాంత మహాపాత్రవంటి ఆధునిక కవులు కూడా జ్ఞానపీఠ పురస్కారంతో సహా ఎన్నో పురస్కారాలు పొందినవారే. ఒరియాలో ఉన్నత స్థాయికథలూ, నవలలూ కూడా ఎక్కువే. మనోజ్‌దాస్ వంటి రచయిత భారతదేశంలోనే కాక, విదేశాల్లో కూడా ప్రశంసలు పొందినవాడు.

ఇంత విస్తృతిగల ఒరియా సాహిత్యం బెంగాలీ భాషావాదుల ఆధిపత్యం క్రింద ఎన్నో ఏళ్లు నలిగిపోయింది. శిష్టవ్యవహారం బెంగాలీలో జరగడం, బెంగాలీలు ఒరిస్సాలో చాలా కాలంగా కీలకస్థానాల్లో ఉండడం మూలాన, ఒరియా భాష తన పూర్వపు వైభవాన్ని సంతరించుకునేందుకు సుదీర్ఘసంఘర్షణ చెయ్యవలసి వచ్చింది.

అలాంటి పునరుజ్జీవనానికి, జీవం పోసిన ఒరియా సాహిత్యపు నవయుగ వైతాళికునిగా ఫకీరుమోహన సేనాపతిని చెప్పుకోవచ్చు. 1843లో పుట్టి 1918లో పరమపదించిన ఈయన సంచలనాత్మక జీవితంతో ఒరియా సాహిత్యం కూడా పెనవేసుకుపోయింది. ఎంతో ఆసక్తి కరంగా సాగిన ఆయన జీవన క్రమం కందుకూరి, చిలకమర్తిల జీవిత చరిత్రలను స్ఫురణకు తెస్తుంది.

ఫకీరుమోహన్ 1843 సంవత్సరం లేక 1250 ఒరియాసంవత్సరం శుక్రవారం మకర సంక్రాంతి రోజున, బాలేశ్వరనగర సమీపానగల మల్లికాసపూర్ గ్రామంలో జన్మించాడు. చిన్నతనంలో తల్లిదండ్రులను కోల్పోయి రోగ గ్రస్తుడైన ఈ పసివాడిని మాతామహి కుచిలాదేవి పెంచింది. ఆవిడ తనకు 65వ సంవత్సరం వచ్చేవరకూ ఈయన వద్దనే ఉండి బాలేశ్వర్‌లోనే కన్నుమూసింది. 'ఠాకు రమా' (అమ్మవారు)గా భావించిన ఆమెను తన జీవన దాయినిగా ఆయన స్వీయచరిత్రలో పేర్కొన్నాడు. చిన్న తనంలో సంభవించిన రోగానికి ఆవిడ మొక్కుకున్న పీర్లమొక్కు కారణంగా మొక్కు చెల్లించేందుకు, ఈయన పేరులో 'ఫకీరు' జేరింది. చిన్నప్పుడు

చదువుకున్న వీధి బడిలో మేష్టారికి ఎన్నో శుశ్రూషలు కూడా చెయ్యవలసివచ్చేది. చదువు చెప్పినందుకు ఇవ్వవలసిన పావలా కూడా ఇచ్చేందుకు పెదనాన్న విసుక్కునేవాడు. 'పిల్లవాడికి వీపు మీద వాతల్లేవు నువ్వుచెప్పే చదువేమిటో తెలీదు' అనేవాడట. అందుకోసం ఆమేష్టారు అనవసరంగా పెట్టే వాతలు భరించేవాడు. త్వరలోనే ఫకీర్‌మొహన్ వీధిబడిచదువు చాలించాడు. అక్కడ రావలసినదంతా వచ్చేసింది.

తరువాత ఫకీర్‌మోహన్ బాలేశ్వర్‌లో బారాబటి స్కూల్లో జేరాడు. నిఘంటువులనూ వ్యాకరణాల్ని అక్కడే నేర్చుకున్నాడు. పెద్దనాన్న, తాలూకు ఓడ తెరచాపలు కుట్టే సంస్థలో పనిచేసాడు. మూడేళ్ల తరవాత ప్రభుత్వ ఉప్పుకార్యాలయంలో (Government Salt Office) గుమాస్తాగా జేరాడు. 1863లో ఎంట్రెన్సు పరీక్షలో ప్రథమశ్రేణిలో పాసయ్యాడు. విద్యాసాగర్ యొక్క వ్యాకరణ కౌముది నాలుగు భాగాలు, రుక్‌పాఠాలు మూడు భాగాలుగా వెలువడినందున తన సంస్కృత భాషా అధ్యయనం సుగమమైందని చెప్పుకున్నాడు.

పావలా స్కూలు ఫీజుచెల్లించలేక విద్యను సాగించలేని ఫకీర్‌మోహన్, అదే బాలేశ్వర్‌మిషన్ పాఠశాలలో రెండు రూపాయల జీతం మీద 1864లో ప్రధాన శిక్షకుడిగా జేరాడు. పదకొండు భాషల్లో పండితుడైన జాన్‌బీమ్స్ అనే ఆంగ్ల పండితుడికి ఆయన తల పెట్టిన "Comparative Grammar of Indian Languages' కు సహాయకుడిగా పనిచేశాడు. ఆయన్ను తన గురుతుల్యుడిగా భావించాడు. 1866లో సంభవించిన భీకర దుర్భిక్షానికి ప్రత్యక్షసాక్షిగా కన్నీరుకార్చాడు. ఒరిస్సాలో రెండవదీ, బాలేశ్వర్‌లో మొదటిదీ ఐన ముద్రణాలయాన్ని 1866లోనే స్థాపించాడు. అందుకుగాను ధనసేకరణకై, జాయింట్ స్టాక్ పద్ధతిలో మొట్టమొదటి కంపెనీని స్థాపించి, షేర్లు అమ్మిన ఘనతకూడా ఈయనదే. అంతకు ముందు ముద్రణాలయం (భాషా ఖానా) అంటే తెలియని బాలేశ్వర్ ప్రజలు కలకత్తానించి వచ్చిన ప్రెస్సుసామాగ్రిని చూసేందుకు తండోప తండాలుగా రాగా, రోడ్డు మీద రాక పోకలు స్తంభించాయట. రాధానాథరాయ్, ఆయన సమకాలీనుడు, చెప్పినట్టు, నవీన ఒరిస్సాలో ఆయన్ను యుగపురుషుడుగా నిలిపేందుకు ఇదొక్కటే చాలును. 'బోధదాయిని' అనే సాహిత్య పత్రికనూ, 'బాలసోర్ సంవాద వాహిక' అనే వార్తా సంచికనూ, వెలువరించాడు. అవి మూతబడేవరకూ, వాటికి ఏకైక రచయితా, పత్రికాప్రతినిధీ, ముద్రాపకుడూ, ప్రచురణకర్తా, సంచాలకుడూ (Distributor), పెట్టుబడిదారూ అన్నీ తానేవి వ్యవహరించాడు. ఏక ముఖాన, బహుకార్యక్రమాలు చేపట్టి నిర్వహించిన కార్యదక్షుడు.

హైందవంలోని వెర్రితలలను నిరసించాడు. క్రైస్తవ మతావలంబుడు కావాలనుకున్నాడు కాని సాహసించలేక పోయాడు. 1867-68 వేసవిలో మొదటి బ్రహ్మసమాజ ప్రార్థనాలయాన్ని బాలేశ్వర్‌లో నెలకొల్పాడు. అందుకు బంధువులూ, జ్ఞాతులూ వెలివేశారు.

1856లో అంటే 13 సంవత్సరాల వయస్సులో తన ప్రమేయం లేకుండా లీలావతీ దేవితో జరిగిన వివాహం కలసిరాలేదు. అనుకూలమైన ఈ దాంపత్య ఫలితంగా ఒక ఆడపిల్లపుట్టింది. ఆవిడ మరణానంతరం 1872లో కృష్ణకుమారి దేవితో వివాహం జరిగింది. పెళ్లి సమయానికి ఈవిడ వయసు 11సంవత్సరాలు. ఒకకొడుకూ, కూతురూ, ఈవిడవల్ల కలిగారు. 1917లో ఈవిడా పరలోకగతురాలైంది. తన జీవితమే శూన్యంగా భావించిన ఫకీర్‌మోహను తరువాత అట్టేకాలం జీవించలేదు. 1918లో ఆయన మరణించాడు.

ఎందరో మహనీయుల జీవితాల్లాగే, ఈయన జీవితం ఆసక్తికరమైన సంగతులతో, సందర్భాలతో నిండి ఉండింది. నాటి చారిత్రిక సాంఘిక పరిణామాలకు ప్రత్యక్ష సాక్షిగా ఈయన నిలిచాడు. తన జీవితపు సుఖదుఃఖాలనూ, ఆటుపోట్లనూ తన కవితల్లోనూ, కథల్లోనూ పొందుపరచాడు. నీలగిరి, దోమాపడా, కేంద్రపడా, డెంకనాల్ సంస్థానాల్లో దివాన్‌గా, మేనేజరుగా పనిచేశాడు. గొప్ప పరిపాలనాదక్షుడిగా పేరుగాంచాడు. తాను నిర్మింపజేసిన, వంతెనలూ, రోడ్లూ, నీటిపారుదల ప్రాజెక్టులను, నేటికీ ఆయా ప్రాంతాల ప్రజలు కృతజ్ఞతా పూర్వకంగా తలచుకుంటారు. జ్యోతిషంలో కూడా అభినివేశం గల ఈయన తనరెండవ భార్య మరణకాలాన్ని ముందే ఊహించగలిగాడు. నిధ నాధిపతి బలవత్తార కారణంగా ఆవిడ 34సంవత్సరాల ఆయుః పరిమాణం కలదిగా భావించాడు. 30వ సంవత్సరంలో ఆవిడకు సంక్రమించిన అజీర్ణరోగం మందులకు లొంగలేదు. మంచం పట్టింది. (1894 ఒరియాశకం) 1917 భాదపద శుక్ల దశమినాడు సాయంకాలం నాలుగు గంటలకు ఆవిడ చనిపోయింది.

డెంకనాల్‌లో మేనేజరుగా ఉండే సమయంలో పుత్ర వియోగం జరిగింది. తన భార్య కృష్ణకుమారిని సాంత్వన పరిచేందుకు రామాయణం చదివి వినిపించేవాడు. సంస్కృత రామాయణం తన భార్యకు సుబోధకమయ్యేందుకు తానే ఒరియా అనువాదం చేపట్టిపూర్తిచేసాడు. అప్పటికే విస్తృతంగా అనువాదాలున్న రామాయణ; భారతాలను తనదైనశైలిలో అనువదించాడు. 1871లో పుత్ర జననం తరవాత ఆరంభించిన భారతానువాదం, ఆ కుమారుడు బి.యే. పాసయ్యే నాటికి అంటే 1909నాటికి పూర్తిచేశాడు.

దోమాపడాలో దివానుగా పనిచేసేకాలంలో, భోయ్ తెగవారు చేసిన తిరుగుబాటు సందర్భంగా వారికి బందీగా చిక్కి కొంతకాలం ఉన్నాడు. ఆ సమయంలో బాలేశ్వర్‌లో ఉన్న భార్య, తదితర బంధువులూ చనిపోయి ఉంటాడని భావించారు. తనజీవితంలోని దారిద్ర్యం, రోగాలు, బంధువుల నుంచి నిరసన, ఎన్నో ప్రాణాపాయ సంఘటనలు ఎదుర్కొన్న ఫకీర్‌మోహన్, వాటి ద్వారా పొందిన అనుభూతులను తన రచనల్లో, కవితల్లో కళాత్మకంగా ప్రతిఫలింపజేశాడు. సామాన్యమైన అనుభూతులనే అసామాన్యంగా చెప్పి సాహిత్య గౌరవం కలిగించాడు. ఈయన కవితలు సర్వజనామోదం పొందాయి. తన భార్యను సాంత్వన పరిచేందుకు, అటు తరవాత ఆమె జ్ఞాపకాలతోనూ కవితలల్లాడు. బాధలు, ఆపదలు వంటి మనస్థిమితం లేని సమయాల్లో, సాధారణ మానవుడిలా విలపించక, కవిత అల్లాడు. బద్రక్, ఆనందపూర్‌ల మధ్య ఏనుగుపై ప్రయాణిస్తూ అతి తక్కువ వ్యవధిలో నాటి ఉత్కళ సాహితీ రంగపు వ్యక్తులను గురించి పద్యరూపంలో రాసి వెంటనే ఆనందపూర్‌లో అచ్చుకిచ్చాడు. రెండురోజుల్లో పుస్తకం తయారైంది. ఉపనిషత్తులను ఒరియాలోకి అనువదించాడు. ఈయనకు 'వ్యాసకవి' అనే బిరుదుకూడా ఉంది.

అనారోగ్యకారణాన ముందుగానే దివాన్‌గా ఉద్యోగ విరమణ చేసాడు. అప్పుడాయన వయస్సు 52 సంవత్సరాలు. అంటే 1895 అన్నమాట. గురజాడ వారి 'దిద్దుబాటు' లాగే మొట్టమొదటి ఒరియా కథ 'లచ్ఛమనియా' దాదాపు అదేసమయంలో రాశాడు. అది కటక్‌లోని బోధదాయినిలో ప్రచురితమైంది. ఆతరవాత ఆయన దాదాపు 23 కథల దాకా రాశాడు. దోమాపడాలో దివానీ సమయంలోనే ఆయన రెండో భార్యపోయింది.

'పుష్పమాల' 'ఉపహార' కవితా ఖండికలను ప్రచురించాడు. పదవీ విరమణానంతరం కటక్‌లో ఉన్న కాలంలో రేవతి అనే కథను రాసాడు. ఆయన కథలన్నీ బహుళ ప్రచారం ప్రజాదరణపొందాయి. అవన్నీ ఆనాటి 'ఉత్కళ సాహిత్య' అనే పత్రికలో 'ధూర్జటి' అనే కలం పేరుతో వచ్చాయి. తన20వ ఏట ఇంగ్లీషు అభ్యసించినట్టుగానే స్వయంకృషితో 50సంవత్సరాలపై బడ్డాక తెలుగు అభ్యసించాడు. 'అపూర్వమిలన్' అనే కథను ఆరంభించగా అది నవలగా రూపుదిద్దుకుంది. ఈ నవల ఒరియా సాహిత్యంలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకుంది. ఆరోజుల్లోనే ప్రజలుదీన్ని ఎగబడి చదవడమేకాక, అందులో వర్ణించిన క్రూరుడైన 'రామచంద్ర మంగరాజ్' అనే జమీందారు వివాదం తాలూకు విచారణ నిజంగా జరుగుతోందేమోనని కొందరు గ్రామవాసులు, ఆ జమీందారుని చూసేందుకు కటక్ కోర్టుకు తరలి వచ్చారంటే, ప్రజలపై ఆనవల ఎటువంటి ముద్ర వేసిందో ఊహించుకోవచ్చు.

ఆయన తన చివరిరోజులు బాలేశ్వర్‌లో గడిపాడు. 'శాంతికాననం' అనేపేరున్న ఆ ఇంటి తోటలో భార్యసమాధి వద్ద శాంతిని పొందుతూ, 'ప్రాయశ్చిత్తి' 'బౌద్ధావతార కావ్యం' ఈ వ్యాసం తయారీలో విస్తృతంగా ఉపయోగించుకున్న 'ఆత్మజీవన చరితా'న్నీ కూడారాశాడు.

1897లో మద్రాసులో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సమావేశానికీ, బ్రహ్మసమాజ్ సమావేశానికీ ఒరిస్సా తరపున ప్రతినిధి (Delegate) గా వెళ్లి పాల్గొన్నాడు. అక్కడ బాలగంగాధర్‌తిలక్‌ను కలుసుకొని, ఆయన స్నేహాన్ని అభిమానాన్ని పొందాడు. రామేశ్వరం వెళ్లాలని సంకల్పించినా, కంచివరకూ వెళ్లి తిరుగు ముఖం పట్టాడు. దారిలో బెజవాడనూ సందర్శించాడు. అక్కడ కృష్ణానదిపై గల ఇనప వంతెన (రైలుబ్రిడ్జి) చూసి, అంత అందమైన వంతెన మరెక్కడా చూడలేదని రాసాడు. తరవాత, ఏలూరులో కూడా దిగి, తరవాత నేరుగా కటక్ జేరుకున్నాడు.

అనేక సంచలనాత్మక సంఘటనలతో నిండిన ఈయన జీవితం, కందుకూరి, చిలకమర్తి వారిజీవితాలను జ్ఞప్తికితెస్తుంది. వారిలాగే ఈయన కూడా తన భాషా సాహిత్యపు నవశకానికి ఆద్యుడు. వాటిపై చెరగని ముద్రవేసి నవశకానికి నాందీపలికాడు. ఆ ఉత్కృష్ట సాహిత్య సృష్టి నేటికీ ఒరియా భాషలో అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ చెప్పుకోదగ్గ రచనలు వస్తున్నాయి. సాఫీగా, సాదాసీదాగా నడచిన ఈ ఆత్మ జీవన చరితాన్ని మరచిపోవడం కష్టం. నాటి, సాంఘిక రాజకీయ వాతావరణానికి అద్దం పట్టిన ఈ రచనలో ఎన్నో ఆసక్తికరమైన విషయాలు ఉదహరించబడ్డాయి. కష్టసుఖాలను సమానంగా స్వీకరించిన ఇలాంటి ద్వంద్వాతీతుల చరిత్ర లేమనకు జీవన సమరంలో స్ఫూర్తినీ, విశ్వాసాన్నీ ఇస్తాయి.

Sources (1) ఫకీర్‌మోహన సేనాపతి 'ఆత్మ జీవన చరిత్ర' (ఒరియా మూలం)

(1) Preface to Fakir Mohan Senapati's Selected Stories Edited & Translated by Leelavathi Mohapatra, & K.K. Mohapatra, Harper & Colrlins imprint Published in India.

* * *

# వివాహాల్లో గోత్రాలు - మేనరికాల ప్రాధాన్యం ఒక పరిశీలన

- డా॥ తంగెడ కిషన్‌రావు
రీడర్ - తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం - హైదరాబాద్

**వివాహం మానవ మనుగడకు మూలం :**

వివాహం కుటుంబ వ్యవస్థకు పునాదిరాయి - ప్రకృతి సహజంగా, వయసులోని మార్పును సూచిస్తూ కల్గే లైంగిక పరమైన కోరికలను చట్టబద్ధం చేసే ప్రక్రియ.

కోరికలను అందునా లైంగిక పరమైన కోరికలను బంధించి ఉంచడం అంత మంచిది కాదు, అని మనస్తత్త్వ శాస్త్ర వేత్తల అభిప్రాయం. అలా అయినప్పుడు దాంపత్య సంబంధమైన కోరికలు కేవలం శారీరకమని భావించటం శాస్త్రీయంగా అవగాహనాలోపం అవుతుంది. ఈ వాంఛ వల్ల తెలియని మానసిక అసంతృప్తి పెరగడం, చీకాకులు చీదరింపులు సంభవించడం, ఏకాగ్రతలోపించడం సంభవిస్తాయి. దానివల్ల తొలుత వ్యక్తికి, వ్యక్తి కుటుంబానికి, ఆతనిలో సంబంధ బాంధవ్యాలున్న సంస్థకు, తద్వారా సమాజానికి క్రమేణా నష్టాలు తారసిల్లే అవకాశం ఉంది. ఈ ప్రాధాన్యం ఉండడం వల్లనే చతుర్విధ పురుషార్థాల్లో కామానికి తృతీయస్థానం లభించి పవిత్రమైన అర్థం చేకూరింది.

సత్సంతానాన్ని కని కుటుంబ బంధాన్ని క్రమం తప్పకుండా కొనసాగించడం కేవలం వివాహం ద్వారానే సాధ్యమౌతుంది. అందువల్ల వివాహం కుటుంబంలోనే కాదు తద్వారా వారి బంధుమిత్రుల సమూహంలో కూడా వైభవంగా జరిగే వేడుకగా రూపొందింది. ఈ విధంగా దంపతుల గృహస్థ జీవితం - సంతానోత్పత్తి, పెంపకం, పోషణలకు తొలి బాధ్యతనే వహిస్తూ తద్వారా మానవుల మనుగడకు దోహదం చేస్తోంది.

**వివాహాల్లో గోత్రాల నిషేధం :**

పెళ్లి సంబంధం కుదుర్చుకునే సమయంలో గోత్ర నియమం పాటించడం ఉంది. ఎందుచేతంటే సగోత్రీకులు రక్త సంబంధీకులు, ఏక గర్భ జనితులు అనేది పురాతనంగా వస్తున్న విశ్వాసం.

ఆటవిక దశనుండి గణ జీవిత దశలోకి ప్రవేశించిన మానవులు తమ సమాజంలోని వారిని ఒకే కుటుంబీకులుగా భావించుకోగల్గారు. ఇది మానవ నాగరికతకు సంబంధించినంత వరకు తొలిమెట్టు. తమ సమూహంలోని జనులంతా రక్త సంబంధీకులే అనే ఆలోచన వారిమధ్య లైంగిక నిషేధాన్ని కూడా ఏర్పర్చింది. ఈ కట్టుబాటు స్త్రీకి రక్షణమూ, భద్రతా భావాన్ని కల్గించింది. అపుడు వేరొక సమూహంలోని స్త్రీ పురుషులతో వారు సంబంధాలు పెట్టుకొని క్రమక్రమంగా తమ గణాలను విస్తరింప జేసుకున్నారు. తద్వారా గణాలమధ్య ఐక్యతాభావం కూడా చోటుచేసుకొంది.

ఈ గణజీవితపు ఆదర్శమే గోత్రాల పుట్టుకకు మొదటి అంతస్తును నిర్మించినట్లు భావించవచ్చు. గణమన్నా, గోత్రమన్నా సమూహం అనే అర్థానికి పర్యాయపదాలే.

'రక్త సంబంధీకుల మధ్య వివాహ నిషేధం ఉండడం మంచిది, లేకుంటే పుట్టే పిల్లల్లో తెలివి తేటలు తక్కువపాళ్లల్లో ఉండవచ్చు. వంశపారంపర్యమైన వ్యాధులకు వారు లోనుగావచ్చు. వారు పుట్టుకతో అంగవైకల్యానికి గురికావచ్చు' - అని శారీరక, మానసిక పరంగా కల్గే లోపాలను గూర్చి జన్యుశాస్త్రవేత్తలు కూడా తమ అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తారు.

ఇదే విషయాన్ని మన పెద్దలు అత్యంత సూక్ష్మంగా గోత్ర నిషేధం పేరుతో అరికట్ట గల్గుతున్నారు. ఈ విధంగా సృష్టింపబడ్డ ఆచారం వెనుక ఆధునిక వైద్యశాస్త్ర రహస్యం ఇమిడి ఉండడం హర్షదాయకమైన విషయం. ఇది ఆరోగ్యశాస్త్ర రీత్యానే కాక సాంఘిక పరంగా ఉన్నత విలువల్ని కలిగి సామాజిక శాస్త్రవేత్తల ఆమోదముద్రను కూడా పొందగల్గింది.

### వివాహాల్లో మేనరికాల ప్రాధాన్యం :

వివాహాల్లో గోత్ర నిషేధం పట్ల అత్యంతశ్రద్ధ, పట్టుదల చూపిస్తున్న పెద్దలు - రక్త సంబంధం కల్గిన మేనరికాలపట్ల అందుకు విరుద్ధంగా వ్యవహరిస్తూ ప్రత్యేకమైన మక్కువను చూపిస్తున్నారు. ఇందుకు కవుల కావ్యాలు కూడా శతాబ్దాలుగా సాక్ష్యాలను పలుకుతున్నాయి.

దీనికి గల ముఖ్యకారణాలు :

పుట్టింటిపట్ల స్త్రీలకుండే తరగని ప్రేమ, గౌరవభావం - వేలు విడువకుండా తమ బంధుత్వాన్ని వంశపారం పర్యంగా కాపాడుకోవాలనే తపన - తమ సోదరీమణులపట్ల అదే సమభావాన్ని కొందరు సోదరులు కూడా కల్గి ఉండడం - ఒకవేళ తమ తమ తల్లి దండ్రుల మధ్య ఏవైనా అడ్డుతెరలున్నప్పుడు, అందుకు తమ స్వతంత్ర బుద్ధిని ప్రకటించి తమ పెండ్లిపట్ల తామే చొరవను ప్రదర్శించే బావామరదళ్లుండడం.

నిజానికి ఇవన్నీ తెలుగు జాతి ప్రత్యేకతకు ప్రతీకలుగా నిల్చే అంశాలు. ఎందుచేతంటే మేనరికాల పట్ల తెలుగు జాతిలో ఉన్న మోజు ఇతర ప్రాంతీయుల్లో ఎక్కువగా కన్పించక పోవడమే.

మేనరికాలపట్ల నేటి జన్యు, వైద్యం వంటి ఆధునికశాస్త్రాలు తమ అభ్యంతరాన్ని ప్రకటించాయి - కాని నాటి ఆపస్తంభుడు, బోధాయనుడు అను సూత్రకర్తలు వీటిపట్ల తమ ఆమోదాన్ని తెల్పారు. తెలుగు జాతి ప్రజలు పూర్వంనుండీ ఇప్పటి వరకూ తమ మక్కువను వ్యక్తం చేస్తూనే ఉన్నారనడానికి సాహిత్యపరమైన సాక్ష్యాధారాలు కూడా లభిస్తున్నాయి.

### సాహిత్యంలో మేనరికాల ప్రసక్తి :

తెలిసినంత వరకు మేనరిక వివాహాల్లో మొదటిదీ అధిక ప్రాధాన్యాన్ని సంపాదించుకున్నదీ సుభద్రార్జునుల వివాహం. సుభద్రార్జునులది మేనసంబంధమే అయినా ఒక విధంగా అదిప్రేమ వివాహమే. కృష్ణుని తోడ్పాటు లేకుంటే అది జరిగి ఉండక పోవచ్చు. కుటుంబ పెద్ద అయిన బలరాముడు వారి వివాహంపట్ల బద్ధవ్యతిరేకి కావడమే అందుకు కారణం. తుదకు వారి వివాహం బలరాముని నిమిత్తం లేకుండానే జరిగినందుకు ఆతడు కోపంతో కృష్ణుని ప్రశ్నించాడని మహాభారతంలోని ఆది పర్వంలో ఆదికవి నన్నయ (క్రీ.శ. 11వ శతాబ్దం) వివరిస్తాడు.

అందుకు కృష్ణుడు,

''తన మేనమఱదలి ధవళాక్షి దోడ్కొని

చనియె నాతని కది చనదె చెపుడ''

'తన మేన మరదలిని వివాహం చేసుకొని తీసుకొని పోవడం అర్జునునికి తగిన విషయమే కదా!' అని బలరామునికి సమాధానమిస్తాడు. దీనివల్ల మేనసంబంధాలలో వధూవరులు పరస్పరం ఇష్టపడినపుడు దానికి పెద్దలు వ్యతిరేకం చెప్పడం అసహజమైన విషయంగా పరిగణింపబడేదని తెలుస్తోంది.

అర్జునునికి సుభద్రకాకుండా ద్రౌపది, ఉలూచి, చిత్రాంగదలు భార్యలేఅయినా, వారితోనూ ఆతడు పుత్రుల్ని పొందినా, కాపురం చేసి వివాహబంధాన్ని పరిపూర్ణంగా కొనసాగించింది మాత్రం సుభద్రతోనే. ఈ బాంధవ్య పక్షపాతం వల్లనే పాండవులు అడుగడుగునా శ్రీకృష్ణుని సహాయం పొందగల్గి పౌరాణిక చరిత్రలోనే అశేషకీర్తిని ఆర్జించగల్గారు.

తమకున్న దగ్గరి బంధుత్వం వల్ల చిన్ననాటి సాన్నిహిత్యం, స్నేహానుభూతులు పెనవేసుకొని, ఒకరిపై ఒకరికి అమితమైన ఇష్టం ఏర్పడి, పెద్దలు వద్దన్నా ప్రేమ వివాహాలకు దారితీసి, సాహసవంతమైన ఘట్టాలతో మేనరిక వివాహాలు జరుగుతున్నాయనేందుకు ఈ జానపద గేయం కూడా నిదర్శనంగా నిలుస్తుంది.

''అబ్బాయి కాచేడు మామయ్య ఇల్లు

కానకుండా పుస్తె కట్టేద్దమాని

తెలియకుండ తలంబ్రాలు పోసేద్దమాని''

ఈ జానపద యువకుడెవరో కాని అచ్చం అర్జునునే ఆదర్శంగా తీసుకున్నాడు. ఈతనికి కృష్ణునివంటి బావసాయం లేకున్నా తన ముద్దుల మరదలి సహాయం తప్పకుండా ఉండే ఉంటుంది, ఒక విధంగా ఇది ఆమె చేసిన సూచన కూడా అయి ఉండవచ్చు.

ఈ విధమైన మేనరికాలు ఆదికవి నన్నయ నుండి ఆ తర్వాత గల కవుల కావ్యాలలోనూ వర్ణింపబడి తమ విశిష్టతను చాటుకున్నాయి.

తనచెల్లెలితో వియ్యమందుకోవాలనే ఉద్దేశంతో రుక్మి తన కూతురును, రుక్మిణికి కుమారుడు తనకు మేనల్లుడు అయిన ప్రద్యుమ్నునకు ఇచ్చినట్లు బమ్మెరపోతన (క్రీ.శ. 1400 - 1450) భాగవత కావ్యం ఈ విధంగా వర్ణిస్తుంది.

''.........ననుజతోడి

నెయ్యంబునను భాగినేయున కిచ్చె గూతు''

అంతేకాదు - తన మనుమరాలగు రుక్మలోచనను అనిరుద్ధునకిచ్చి పెండ్లిచేసి తన బాంధవ్యాన్ని ఇంకొకతరం కూడా రుక్మి కొనసాగిస్తాడు.

.దన కూర్మి మనుమరాలి
రుక్మలోచన నసమాన రుక్మకాంతి
జెలిమి ననిరుద్ధునకు బెండ్లి సేయునపుడు''
అని భాగవత కావ్యం వివరిస్తుంది.
''......... బరీక్షిత్కుమారుండు........నుత్తరుని
పుత్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియాడి,......''

అని ఉత్తరకు కుమారుడైన పరీక్షిత్తు తన మేనమామ అయిన ఉత్తరుని కుమార్తె ఇరావతిని వివాహమాడిన విషయాన్ని కూడా భాగవత కావ్యం తెలియజేస్తుంది.

కవితా పితామహుడగు అల్లసాని పెద్దన (క్రీ.శ. 15-16 శతాబ్దాల నడిమికాలం) కవికూడా తాను రచించిన మనుచరిత్ర కావ్యంలో ఈ మేనరిక వివాహానికి చోటిచ్చి గౌరవించాడు.

''ఆయుర్వేదము గైకొని
యాయింతిం బెండ్లియాడు.....''

మని, వరూధిని సోదరుడైన ఇందీవరాక్షుడు అనే గంధర్వుడు, తన కుమార్తె మనోరమను, తన మేనల్లుడు స్వరోచికిచ్చి పెండ్లిచేసి, తాను బ్రహ్మమిత్రుడు అనే మునివద్ద మాయోపాయంచే నేర్చుకున్న ఆయుర్వేద విద్యను అల్లునికి గౌరవంగా సమర్పిస్తాడు.

ఈ విధంగా పురాణాల్లోని మేన సంబంధాలు కొన్ని ప్రేమ సంబంధాలైతే, కొన్ని బంధుత్వాన్ని నిల్పుకోవాలనే గౌరవంతో పెద్దల చేతుల మీదుగా జరిగాయి. ఈ వివాహాల వెనుక ఆస్తిని ఇతరులకు పోనివ్వకూడదనే అంశం కూడా తగిన పాత్రనే నిర్వహిస్తోంది.

'సమాజం మాతృస్వామికం నుండి పితృ స్వామికం వైపు పరుగులిడుతున్న సంధికాలంలోనే మేనరిక వివాహాలు అమల్లోకి వచ్చాయి. గణవ్యవస్థలోని తండ్రి ఆస్తి పరాయివారికి గాక, తన కన్న బిడ్డలకే చెందాలనెడి కోరికతో బిడ్డను అక్కకొడుక్కు యిచ్చి పెండ్లి చేసేవారు. దీనివల్ల గణవ్యవస్థ నియమం ప్రకారం ఆస్తిమేనల్లునికి దక్కుతుంది' అని మేనరికాల వెనుకగల ఆర్థిక పరమార్థాలను సామాజిక శాస్త్రవేత్తలు పట్టిచూపిస్తున్నారు.

పెద్దలదృష్టి ఏదైనప్పటికీ పెళ్లిచేసుకునే యువత అభీష్టం మాత్రం బాల్యంనుండీ పెనవేసుకున్న తమ మనసులు విడిపోకూడదనే కోరికతోనే వారు ఈ వివాహాల పట్ల మొగ్గుచూపిస్తున్నారనే వైనాన్ని తెలియపరుస్తుంది. ఈ అంశాన్ని కొంత పరిశీలించి చూస్తే, మనకు ఇంకా కొన్ని విషయాలు అవగతమౌతాయి.

- స్త్రీ సామాన్యంగా స్వాతంత్ర్యాన్నీ, సంతోషాన్నీ ప్రేమిస్తుంది. స్వేచ్ఛాపూరితవాతావరణంలో తల్లిదండ్రుల ముద్దుముచ్చట్లతో ఆమె పెంపకం జరుగుతుంది. కాని, పెళ్లి కాగానే భర్తతోనే కాదు, అత్తతో కూడా ఆ స్వేచ్ఛ హరించుకుపోయి ఆమె జీవితంలో నీలనీడలు అలుముకుంటాయి. అందుకే పెళ్లి విషయంలో సంపన్నులను కోరుకోక, తనతో ఆటలాడి పెరిగిన బావను, తన ముద్దు ముచ్చట్లకు అడ్డురాని అత్తనే ఆమె కోరుకుంటుంది. ఆమెకు కావల్సింది సంపద కాదు,

తెలుగువారి మేనరికపు సంప్రదాయం వెనుక దాగిన ఈ పరమార్థాన్ని ఓ చిన్న గేయం స్పష్టంగా తెలియజేస్తుంది.

''తంగేడు చెట్టుక్రింద లింగు బుట్టింది
లింగూకు నీలు బోసి నీలంగి దొడిగి
నిన్నెవరి కిత్తునే నాసిన్నిలింగు
కోమటోరి కిత్తా పోతావే లింగూ?''
అని తన ముద్దుల చిన్న బిడ్డకు వయసురాగానే తల్లి ప్రశ్నిస్తుంది.
''కోమటోరి కొల్తలు నే గొలువలేను''

అని బిడ్డ సమాధానం చెప్తుంది. అదే విధంగా ఇతర కులాల గూర్చి అడిగినా సమాధానం తల్లికి అనుకూలంగా రాదు. అప్పుడు తల్లి - ఎవరికిస్తే బాగుంటుంది అనుకొని,

''అత్తకొడుకుకిత్తే పోతావె లింగూ?'' అని అడిగితే,

''అట్లైతె అడ్డెందు కమ్మ నే బోతా''

అని సంతోషంగా బిడ్డ సమాధానమిస్తుంది. తన మనసులోని విషయాన్ని సిగ్గుతో చెప్పని ముగ్ధత్వం, తల్లినోటనే పలికించిన జాణతనం, ఈ జానపద యువతి నెరజాణత్వాన్ని పట్టి కొలుస్తాయి.

ఈ విధంగా తెలుగు జాతి యువతీయువకులూ, వారివారి తల్లిదండ్రులూ శతాబ్దాలుగా మేనరిక వివాహాలపై తమ తరగని మనోభీష్టాన్ని వ్యక్తపరుస్తూ వాటి విశిష్టతను లోకానికి చాటుతున్నారు.

అందుకు ఆర్థిక, సామాజిక, మానసికపరమైనఎన్నో ప్రయోజనాలను వారు పేర్కొంటున్నా 'తెలియని బంగారు పూలకన్నా, తెలిసిన బంతిపూలనే కోరుకునే' వారి లౌకిక దృష్టికూడా ఈ మేనరికాల ముసుగులో దాగి ఉన్న జీవిత సత్యం. అందువల్లనే ఇవి శాస్త్రీయమైన అంశాలను సైతం లెక్కచేయకుండా కాలంతో పాటు తమ ఉనికిని కాపాడుకుంటూ పెళ్లి సంబంధాలలో ప్రథమస్థానాన్ని పొందుతూ తెలుగు జన జీవితాల్లో మన గల్గుతున్నాయి.

కాని, ప్రస్తుత అత్యంత ఆధునికమైన వ్యవస్థలో మాత్రం - విద్యావంతురాలైన స్త్రీ అన్ని విధాలా పురుషునికి దీటుగా నిల్చి తనను మెచ్చిన వాన్ని కాదు - తనకు నచ్చిన వాన్నే కట్టుకొని వైవాహిక బంధానికి కొత్త అర్థాన్నిస్తోంది.

అలాంటి పరిస్థితుల్లో క్రమేణా మేనరికాలు, బంధుత్వ వివాహాలు చెదిరిపోవడమే కాదు - కులాల సరిహద్దులు కూడా చెరిగిపోతాయి. అది - కాల ప్రభావం.

కాలం - మార్పును సూచిస్తుంది.
మార్పు - చైతన్యాన్ని ప్రతిబింబిస్తుంది.
చైతన్యం - వ్యక్తిత్వానికి ప్రతీకగా నిలుస్తుంది.

* * *



ప్రకృతిపురుష - భరద్వాజ శాస్త్రి

MISIMI/ మిసిమి RNI Regd. No. 45042/90 Telugu Monthly, Hyderabad - 500 020. Postal Regd. No. H/SD/191



గత ప్రేమ బంధాల సెగల పగల వగల అగ్నిపర్వతం బ్రద్దలు కానీకు,
స్నిగ్ధ మధుర సంగీత స్వనాలతో చిరు వాన జల్లులతో ప్లావితం కానీ,